# తులనాత్మక
# సాహిత్య అధ్యయనం

(వ్యాస సంకలనం)

డాక్టర్ ఎల్లా బాలకృష్ణారెడ్డి

చైతన్య ప్రచురణలు

TULANAATMAKA SAAHITYA ADHYAYANAM
(Essays on Comparative Literary Studies)

by Dr. E. Balakrishna Reddy
Lecturer in Telugu Govt. Junior College, Rayachoty 516269

Chaitanya Publications : No. 3
First Edition : August 1990
Title Design : PAVAN, Hyderabad

Price : Rs. 25/-

For Copies
VISALAANDHRA PUBLISHING HOUSE
4-1-435, Vignana Bhavan,
Bank Street, Hyderabad 500 001

UNIVERSITY BOOK CENTRE
Tirupati

Printed at
MASTER PRINTERS
153. S. B. I. Colony, Gandhinagar
Hyderebad - 500 380

అంకితం

మహిమగల మంత్రాలయ
శ్రీ రాఘవేంద్ర స్వాముల వారి
పాద పద్మములకు

ఆచార్య కె. సర్వోత్తమరావు
తెలుగు అధ్యయనశాఖ,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం.
తిరుపతి

# ఆమోదం

సాహిత్య అధ్యయన పద్ధతులలో తులనాత్మక అధ్యయన పద్ధతికి ఈనాడు ఎంతో ప్రచారం ప్రయోజనం పెండూ కనిపిస్తున్నాయి. విశ్వవిద్యాలయాలలో తులనాత్మక అధ్యయనం దినదినాభివృద్ధి పొందుతూ వుంది. ఎం.ఏ పాఠ్యాంశాలలో తులనాత్మక అధ్యయనాన్ని ప్రవేశపెట్టిన కీర్తి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయన శాఖకే దక్కడం ఎంతో సంతోషించదగ్గ అంశం. దాక్షిణాత్య భాషా సాహిత్యాల తులనాత్మక అధ్యయనానికి పునాది వేయడం మాత్రం కాకుండా పరిశోధనలో కూడా అభిరుచిని, ప్రోత్సాహాన్ని కలిగించిన వారు ఆచార్య జి యస్. రెడ్డిగారు ఈలాంటి విశ్వవిద్యాలయంలో దాక్షిణాత్య భాషా సాహిత్యాల తులనాత్మక అధ్యయనాన్ని ఐచ్ఛికాంశంగా ఎన్నుకుని ఈ అధ్యయనాభిరుచిని పెంచుకున్న కొంతమందిలో చి|| ఎ. బాలకృష్ణారెడ్డి ఒకరు. డిగ్రీ కళాశాల చదువు సాగుతున్న రోజుల్లోనే పద్యాలు వ్రాయడం, స్నాతకోత్తర విద్యాభ్యసనం చేసే వేళ పరిశోధనాత్మక వ్యాసాలను చదవడం వంటివి ఆనాటి మిత్రులు, శ్రేయోభిలాషులు, గురువులు మనసారా మెచ్చుకున్న అంశాలు. లోగడ రెండు, మూడు పుస్తకాలు ప్రచురించినా ప్రస్తుతం సాహిత్య లోకానికి అందిస్తున్న వ్యాస సంకలనం 'తులనాత్మక సాహిత్య అధ్యయనం.'

ఈ వ్యాస సంకలనంలో ఏడు వ్యాసాలున్నాయి. తమిళాంధ్ర సాహిత్యాలకు సంబంధించినవి రెండు - జాతీయ కవులు భారతి గరిమెళ్ళ తులనాత్మక పరిశీలన, తమిళాంధ్ర సాహిత్యాలలో సిరియాళ కథ. కన్నడాంధ్ర సాహిత్యాలకు సంబంధించినవి రెండు - కన్నడాంధ్ర సాహిత్యాలలో దేశి రచనల తులనాత్మక పరిశీలన, తెలుగు కన్నడ జానపద పారమార్థిక గేయాలు - సరూ

పత. ఇక భక్త కవయిత్రులకు సంబంధించిన వ్యాసం. 'అక్క మహాదేవి మీరాబాయి' అయితే టీకా ప్రక్రియకు సంబంధించిన తులనాత్మక పరిశీలన 'తెలుగు వంగ నవలా సాహిత్యం జాతీయోద్యమం' వీటన్నిటికి మకుటాయమానంగా వ్యాస సంకలనంలోని మొదటి వ్యాసం తులనాత్మక అధ్యయనం ఆవశ్యకత'

తులనాత్మక పరిశోధన కత్తిమీది సాములాంటిది. భిన్న భాషల పరిచయం అవసరమయినా అంతకంటె అవసరమయింది తులనాత్మక దృష్టి. ఈ తులనాత్మక అధ్యయనంలో కొన్ని సార్లు రాళ్ళే మిగులుతాయి. మరి కొన్ని సార్లు రత్నాలరాసులు కనిపిస్తాయి. కొన్ని వేళల్లో పరిశోధకుని ప్రయత్నం పలనాటి 'గంగ' లాంటిదే. మరికొన్ని వేళల్లో అడుగడుగున అమృత ఝరి తలుపులు తెరచుకొని విశాలమయిన విశ్వాన్ని, విస్మృత రహస్యాల్ని అనుభవ పూర్వకంగా గ్రహించే వ్యక్తి తులనాత్మక అధ్యయన పరిశోధకుడు. ఈలాంటి అధ్యయనం చేస్తున్న కొత్త తరం వారిలో శ్రీ బాలకృష్ణారెడ్డి ఒకరు

ఈ వ్యాస సంకలనంలోని వ్యాసాలన్నీ ప్రామాణికాలు. ప్రామాణికత్త తులనాత్మక అధ్యయనం అంతఃస్రవంతి. ఈ స్రవంతిని గుర్తించి ఆధారాలు చూపడంలోను, విషయ వివరణ చేయడంలోను డా॥ బాలకృష్ణారెడ్డి కృతకృత్యులయ్యారనడంలో సందేహం లేదు.

అన్నిటికన్నా చి॥ బాలకృష్ణారెడ్డి మా విద్యార్థి పందిరి పాకుతున్న మల్లెతీగె లాంటిది కృష్ణారెడ్డి ప్రయత్నం. మరికొన్ని వ్యాస కుసుమాలు డా॥ రెడ్డి అందించాలని అభ్యర్థన. ఈ కుసుమ పరిమళాలకు నిర్ణేతలు రసజ్ఞులు.

కె. సర్వోత్తమరావు

# కృతజ్ఞతలు

'తులనాత్మక సాహిత్య అధ్యయనం' అనే ఈ పుస్తకానికి ప్రేరకులు, సూచన లిచ్చినవారు గురువర్యులు ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డిగారు -

వ్రాతప్రతులను పరిశీలించి, తగు సలహాలందించిన వారు గురువర్యులు ఆచార్య జి. నాగయ్యగారు

అడిగిన వెంటనే సహృదయతతో ఆమోదం తెలిపిన గురువర్యులు ఆచార్య కె. సర్వోత్తమరావు గారు

కావలసిన గ్రంథాలందించిన వారు మిత్రులు శ్రీ పి. కొండారెడ్డిగారు, శ్రీ వి. షణ్ముగం గారు

వ్రాతప్రతులు సిద్ధం చేసిన చి॥ ఎం. వాణి, చి॥ ఇ. శారద

ముఖపత్ర రచన చేసిన శ్రీ. పవన్ గారు

ముచ్చటగా సకాలంలో ముద్రించి యిచ్చిన మిత్రులు శ్రీ వాసిలి వసంతకుమార్ గారు

సదా నా శ్రేయస్సు కోరి ఆశీస్సు లందించే అమ్మ చెంగమ్మ, నాన్న శ్రీ అంకిరెడ్డిగారు, అత్తయ్య శ్రీమతి బి. వై. సీతారామమ్మ గారు

అందరికీ కృతజ్ఞతాంజలి.

ర్ల బాలకృష్ణారెడ్డి

# విషయసూచిక

# తులనాత్మక అధ్యయనం ఆవశ్యకత

ప్రపంచంలో ఈనాడు అన్ని రంగాలలో తులనాత్మక అధ్యయనం ప్రాధాన్యత వహించింది. ముఖ్యంగా సాహిత్యరంగంలో ఈవిధాన ఆవశ్యకత ఎంతైనా ఉంది. క్రీ. శ. 1848 లో మాథ్యూ ఆర్నాల్డ్ కవి 'Comparative literature' అనే మాటను మొదట వాడినారు. దీనినే 'తులనాత్మక సాహిత్యము' అని వరకు వ్యవహరిస్తున్నాం. ఈ తులనాత్మక పరిశీలనను ప్రప్రథమంగా ప్రారంభించినవారు జర్మనీ దేశానికి చెందిన ఫెడరిక్ సెలగల్ ఎ. డబ్ల్యు సెలగల్ అని విజ్ఞుల భావన.

''ఇరుగు పొరుగు భాషల్లో లేదా భిన్న దేశాల్లో వెలసిన సాహిత్యాలను సరిపోల్చి వాటిలోని సామ్యవైషమ్యాలను పరస్పర ప్రభావాదులను ప్రత్యేక లక్షణాలను పరిశీలించడమే తులనాత్మత పద్ధతి''1 దీనివల్ల ప్రపంచ సాహిత్యాలన్నింటిలోని మహాకవులను వారి ఉత్తమరచనలను దేశకాలాతీతంగా సరూపతను నిరూపించి సాకల్యంగా అధ్యయనం చేసే వీలు కల్గుతుంది.

వివిధ దేశాలలో ఈ తులనాత్మక అధ్యయనపద్ధతి వివిధ రకాలుగా కనిపిస్తుంది. అమెరికాలో ఒక సాహిత్యాన్ని మరో సాహిత్యంలో అనుసంధించడమేగాకుండా వివిధ శాస్త్రాలను, కళల విజ్ఞానాన్ని కూడా అనుసంధించి ఒక శాస్త్రీయక్రమంలో తులనాత్మక అధ్యయనం చేపట్టినారు. అక్కడ Science of Literature 'Theory of literature', 'Literature in Translation' 'world literature' అని పలుపేర్లతో తులనాత్మక అధ్యయనం సాగుతుంది. రష్యాలో లిఖిత సాహిత్యానికి మౌఖిక సాహిత్యానికి (జానపద సాహిత్యం) మధ్య తులనాత్మక అధ్యయనం ప్రారంభమైంది. జాన

పద విజ్ఞానాన్ని సశాస్త్రీయంగా అధ్యయనంచేస్తే మన గతచరిత్ర, సంస్కృతి సనాతన ధర్మాలు, ఆచార వ్యవహారాలు, మన నమ్మకాలు, వైద్య విధానం మొదలైన ఎన్నో విషయాలు వాటి సామ్యాలు, ఐక్యత వెల్లడికాగలవు. ప్రతి చక్కటి జానపద విజ్ఞాని తులనాత్మక శాస్త్రజ్ఞుడు కాగలడని పండితాభిప్రాయం. ఫ్రాన్సులో యూరపు ఖండ శాంతి సమైక్యతలకు, ఒక జాతీయ సాహిత్యాన్ని మరో జాతీయ సాహిత్యంతో అనుసంధించి, తులనాత్మక అధ్యయనం సాగుతుంది.

పడమటి దేశ మేధావులు సంస్కృత భాషా పరిచయం ద్వారా అందలి విజ్ఞాన విషయాలను, వాళ్ళ భాషా సాహిత్యాలతో తులనాత్మక అధ్యయనం చేయడంవల్ల సంస్కృతంలో ఉన్న సాదృశ్యం వారిని ఆశ్చర్య చకితుల్ని చేసింది. దాంతో తూర్పు దేశాలైన భారత, చైనా దేశాల గురించి విశేషంగా అధ్యయనం చేశారు. ఆ 'ఓరియంటల్' అధ్యయనం ద్వారా ప్రాక్ - పశ్చి మాలకు వైజ్ఞానికంగా గొప్ప వంతెన ఏర్పడింది. ఆయా దేశాలలో నేడు జాతీయ అవసరాల కనుగుణంగా తులనాత్మక అధ్యయనం సాగుతుంది. ప్రపంచ సాహిత్యం అనే మాట వైపు తులనాత్మక అధ్యయనం పయ నిస్తూంది. డా॥ జి. లక్ష్మీనారాయణగారు తులనాత్మక సాహిత్యానికి మారు పేరుగా సార్వత్రిక సాహిత్యం (General literature) అని పేర్కొన్నారు. కేవలం భాషా సామ్యాలేగాక చారిత్రక సంఘటనలు, కళలు, సంస్కృతి, మతము, జీవన సంఘటనలు సామాజిక స్థితిగతులు, రాజకీయ పాలనా పద్ధ తులు, ఇత్యాదులన్నీ తులనాత్మక అధ్యయనానికి ముడివస్తువులైనాయి.

ఇంతటి విస్తృతిని సంతరించుకున్న తులనాత్మక పద్ధతికి ఎప్పుడో పరిమితార్థంలో పెట్టిన తులనాత్మక సాహిత్యమనే పేరు సరిపోదు. అంతకన్నా విపులార్థంగల 'Comparative Studies' అనే మాట సరిపోతుంది. దీనిన్నే తులనాత్మక అధ్యయనం అనవచ్చు. ప్రొఫెసర్ ఎం. సుబ్బారెడ్డిగారు Studies అనే పదానికి విస్తృతార్థం ఉంది. కేవలం భాషా సాహిత్యాలకు మాత్రమేగాక సంస్కృతి, చరిత్ర మొదలైనవాటి అవగాహన కూడా జరుగుతుంది, అనే అర్థంలో Studies అని వాడతాం'[3] అని అన్నారు. కాబట్టి అర్థవ్యాప్తితో కూడిన 'Comparative Studies' అని వాడడమే సమంజసం.

భారత దేశంలో ఈ అధ్యయన శాఖకు సంబంధించి రవీంద్రనాథ్ ఠాగూరు 1907 లో జాతీయ విద్యా పరిషత్ (National Council of Education) వారు ఏర్పాటు చేసిన 'కంపారిటివ్ లిటరేచర్'పై ప్రసంగిస్తూ విశ్వసాహిత్యమని నామకరణం చేశారు. ఈ పేరు ఎంతో విపులార్థం కలిగి ఉంది.

మనదేశం పెక్కు భాషలకు, మతాలకు, ఆచార వ్యవహారాలకు ఆలవాలం. అయినా భిన్నత్వంలో ఏకత్వం (Unity in diversity) కనిపిస్తుంది. మనమంతా ఒకటే అనే జాతీయ భావం మనలో జీర్ణించుకుని పోయింది. జాతీయ భావానికి మనసు ముఖ్యం. అదే విధంగా భారతీయులు భిన్న భాషా వ్యవహర్తలైనా 'భారతీయత' అనే ముద్ర భారతీయ సాహిత్యాలన్నింటిలో ప్రతిబింబిస్తూ ఉంది. 'భాషలు వేరైనా భావం ఒక్కటే' అనే ఆచార్య సి. నా. రె. మాటలు తులనాత్మక అధ్యయనానికి ప్రాణం.

భాషలు వేరైనా, దేశకాలాదులు వేరైనా రచనలలో ఒకే విధమైన భావం కనిపించడం, అది కూడా అనువాదమో అనుకరణమో అన్నట్లు సామ్యం కన్పించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఒక చిన్న ఉదాహరణ చూడండి—

తమిళ సాహిత్యంలో మహాకవి తిరువళ్ళువర్ సంగయుగానికి చెందిన. కవి. ఆయన వ్రాసిన 'తిరుక్కురళ్' కావ్యం తమిళ వేదం లాంటిది. అందులో—

"ఎప్పొరుళ్ యార్ యార్ వాయ్ క్కేట్పినుం

అప్పొరుళ్ మెయ్ పొరుల్ కాణ్బదరివు" - అని పేర్కొన్నారు.

తెలుగులో సుమతిశతకకారుడు అదే భావాన్ని -

కం॥ వినదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్

కనికల్ల నిజము తెలిసిన

మనుజుడె పోసీతిపరుడు మహిలో సుమతీ!" - అనే పద్యంలో వ్యక్తం చేశారు. వీరు భిన్న ప్రాంతాలకు, కాలాలకు, భాషలకు చెందిన వారు కాబట్టి ఒకరి భావాలు ఒకరు తెలుసుకునే వీలులేదు. అయినా ఇద్దరి భావాలు ఒకటిగా ఉండడంచూస్తే ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇటువంటివి ప్రపంచ సాహిత్యంలో అనేకం కనిపిస్తాయి.

ఆంగ్లకవి షేక్స్పియర్ అలంకారాభివ్యక్తికి, వాల్మీకి మహర్షి అలంకారికాభివ్యక్తికీ ఎంతో బాంధవ్యముందని (సామ్యం) గుంటూరు శేషేంద్రశర్మ పేర్కొన్నారు.

"భారతదేశంలో వాల్మీకి అంటాడు —

"స్థిమితం గంతు మారే భే భయాద్గోదావరీ నదీ"

(భయంకరుడైన రావణున్ని చూచి వేగంగా ప్రవహించే గోదావరి నది మెల్లి మెల్లగా ప్రవహించసాగింది.) వాల్మీకి ఎప్పటివాడో కదా?

ఆంగ్లకవి ఎడ్మండ్ స్పెన్సర్ (క్రీ.శ. 1552) థేమ్సునదిని ఉద్దేశించి అంటాడు — "Sweet Thames run softly till I end my song" (నా పాట పూర్తయే వరకు మెల్లగా ప్రవహించు అని అర్థం)[4]"

ఈ విధమైన సామ్యాలెన్నో తులనాత్మక అధ్యాయనం వల్ల తెలుస్తాయి రచయితలలో విస్తరించిన భావ సామ్యం అంత బలవత్తరమైంది. సమస్త మానవ కార్యకలాపాల్లో ప్రపంచమంతటా పోలికలున్నాయి. అవన్నీ తులనాత్మక అధ్యయనానికి యోగ్యవస్తువులే.

భారతీయ భాషలలో ఉత్తర భారతీయ భాషలను ఆర్యభాషలని, దక్షిణ భారత భాషలను ద్రావిడ భాషలని వ్యవహరిస్తున్నాం. తొలుత తులనాత్మక అధ్యయనానికి శ్రీకారం చుట్టిన రాబర్ట్ కాల్డ్వెల్ పండితుడు 'A comparitive grammar of Dravidian languages" అనే తన గ్రంథంలో మన తెలుగు భాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందిందని నిరూపిస్తూ, ద్రావిడ భాషా వ్యాకరణాలను, తులనాత్మక అధ్యయనం లక్ష్యాన్ని నిర్దేశించినారు.

ద్రావిడభాషలని వ్యవహరింపబడే నేటి దక్షిణ భారతదేశ భాషలన్నీ ఒకప్పుడు అతి ప్రాచీన కాలంలో ఒకటిగానే ఉండేవి. కాలక్రమేణ ప్రాచీన

ద్రావిడభాష నుండి విడిపోయి తమిళం, కన్నడం, తెలుగు, మలయాళములనే వేర్వేరు ప్రత్యేక భాషలుగా రూపొందినాయి క్రీస్తుపూర్వమే ప్రత్యేక భాషలుగా రూపొంది ఉండవచ్చు. ఆ విధంగా విడివడిన భాషలలో మూల రూపాలు ఒకే విధంగా ఉండడం చూడవచ్చు. క్రియా రూపాల్లోను, నామవాచకాల్లోను, సంఖ్యావాచకాల్లోను, సంబంధ వాచకాల్లోను, పద, వాక్య నిర్మాణాలలోను, ఈషద్ భేదము కానవస్తున్నా ఈ భాషల మూల రూపాలు ఒక్కటే. ఒకే భాషా కుటుంబానికి చెందిన భాషా సాహిత్యాలతో సాహిత్యపరంగానేగాక, చారిత్రకంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా సామ్యాలుంటాయి. వీటన్నింటిని తులనాత్మక అధ్యయనం చేస్తే అనేక పోలికలు, విశిష్టతలు వెల్లడవుతాయి. భాషలు వేరైనా భావమొక్కటేనని తెలుస్తుంది. ఇదే విధంగా ఆర్య భాషలకు ద్రావిడ భాషలకు గల సామ్య భేదాలను తులనాత్మకంగా అధ్యయనం చేయ వచ్చు.

జానపదగేయాలు ఆయా భాషల స్వీయ చరిత్రల్లాంటివి. ఉత్తర దక్షిణ భారతదేశాల జానపదగేయాలు స్థూలదృష్టికి వేరనిపించినా, రెండు ప్రాంతాల లోని ఆచార వ్యవహారాలు, ఆహారవిహారాలు, జనుల జీవన సరళి, కొంత భిన్నంగా ఉన్నట్లు గోచరించినా, సూక్ష్మంగా పరిశీలిస్తే వీటన్నింటిలో పూస లలో దారం లాగ, ఒక సామ్యత, ఐక్యత నిహితంగా ఉన్నట్లు తులనాత్మక పరిశీలన వల్ల తెలుస్తుంది. దీనినే మనం భారతీయ సంస్కృతి అంటున్నాం. అమెరికాలో వలె మన భారతదేశంలో కూడా లిఖిత సాహిత్యాలకు, మౌఖిక సాహిత్యాలకు తులనాత్మక అధ్యయనం ప్రారంభం కావాల్సిన అవసరం ఎంతైనా ఉంది. సహజ జాతములైన స్వతంత్ర రచనలే తులనాత్మక అధ్యయ నానికి యోగ్యమైన సామగ్రి.

## తులనాత్మక అధ్యయన పద్ధతులు

1. ఒక భాషలోని మౌఖిక సాహిత్యానికి, గ్రంథస్థ సాహిత్యానికి గల భేద సాదృశాలను, విశిష్టాంశాలను తులనాత్మకంగా పరిశీలించి వెల్లడించ వచ్చు.

2. ఒక సాహిత్యంలో ఒక అంశంపై ఒకే ప్రక్రియలోగాని, వేర్వేరు ప్రక్రియలలోగాని పలువురు కవులు చేసిన రచనలుంటే వాటి ఇతి వృత్తంలో, పాత్రచిత్రణలో, వర్ణనలలో, రసావిష్కరణలో, రచనా దృక్పథంలో గల సామ్యభేదాలను, విశిష్టతలను తులనాత్మకంగా అధ్యయనం చేయవచ్చు.

3. భావానువాదంగాని, స్వేచ్ఛానువాదంగాని చేసిన రచనలలో మూలానికి, అనువాదానికి గల మార్పు చేర్పులను, అందు వ్యక్తమయ్యే దేశీయతను తులనాత్మకంగా పరిశీలించవచ్చు.

4. ఒకే భాషలో వెలువడిన రచనలను, వేరొక భాషలో అదే ఇతివృత్తంతో గాని, సారూప్యం గల వస్తువుగాని గల రచనలతో పోల్చి అందు వ్యక్తమయ్యే భావాలను, కథా వస్తువులో గల మార్పులను, అందుకు గల కారణాలను, మత, సాంఘిక స్థితిగతులను, ఆచార వ్యవహారాలను తులనాత్మకంగా పరిశీలించవచ్చు.

5. ఇతివృత్తం ఒకటిగాకున్నా వేర్వేరు ప్రాంతాలకు, భాషలకు, కాలానికి చెందిన కవులలో గాని, వారి రచనలలో గాని కాన్పించే భావ సామ్యాలను, కవి సమయాలను, దృక్పథాలను వాటి నేపథ్యాన్ని తులనాత్మకంగా అధ్యయనం చేయవచ్చు.

6. ఒకే కాలంలో గాని, వేర్వేరు కాలాలలో గాని, వేర్వేరు భాషలలో గల సాహిత్యోద్యమాలను, జాతీయోద్యమాలను, వాటి ప్రభావంతో వచ్చిన రచనలను, కవులను, సమకాలీన సాంఘిక స్థితిగతులను తులనాత్మకంగా అధ్యయనం చేయవచ్చు. ఒకే ప్రక్రియలో వివిధ భాషలలో వచ్చిన రచనలను వేరొక భాషలో అదే ప్రక్రియలో గల రచనలతో పోల్చి భేద సాదృశ్యాలను, ఒక భాషపై మరొక భాషకు గల ప్రభావాన్ని వెల్లడించవచ్చు.

7. వేర్వేరు భాషలలో, ప్రాంతాలలో కనిపించే ఆచారవ్యవహారాలను, సంస్కృతిని, కళలను, జీవన విధానాన్ని, నమ్మకాలను, చారిత్రక సంఘటనలను, వైద్య విధానాలను జానపద విజ్ఞానాన్ని తులనాత్మకంగా

అధ్యయనం చేయవచ్చు. వాటిలో గల విశిష్టాంశాలను వెల్లడించవచ్చు. వీటన్నింటికీ శాస్త్రీయ దృక్పథం అవసరం.

## అనువాదాల ఆవశ్యకత

ఆధునిక ప్రపంచానికి తులనాత్మక సాహిత్యం అనివార్యం అయినా అన్ని భాషలవాళ్ళు అన్య భాషలను అధ్యయనం చేయడం ఎలా? ఏ ఒక్క వ్యక్తి అన్ని భాషలలో పాండిత్యాన్ని సంపాదించలేడుగదా! తులనాత్మక సాహిత్య ప్రక్రియ వికసించి ఫలించాలంటే అన్య భాషా సాహిత్యాలు అందుబాటులోకి రావాలి. దానికి సులభమైన మార్గం అనువాదం. అనువాదాలవల్ల ప్రపంచ భాషా సాహిత్యాలన్నీ సన్నిహితమౌతాయి. తెలుగు సాహిత్యానికిగాని, మరే భాషకైనాగాని అంతర్జాతీయతను కల్పించే సాధనం అనువాదం. ఇతర భాషా గ్రంథాలను తమ తమ భాషలలోనికి, తమ భాషల లోని ఉత్తమ గ్రంథాలను ఇతర భాషలలోకి తీసుకుని వెళ్ళాలి. తద్వారా తులనాత్మక అధ్యయనం సులభమౌతుంది.

అనువాదంవల్ల ఆయా భాషల ప్రతిష్ఠ కూడా పెరుగుతుంది. వివిధ భాషల మధ్యగల భేదభావాలుతగ్గే అవకాశం ఉంది. ఏ దేశంలోనైనా మానవ సన్నివేశాలన్ని ఒకటిగానే ఉంటాయని అనువాదంవల్ల గ్రహించవచ్చు. యూరోపులో గత అర్థ శతాబ్దంనుంచి అనువాదం భారీయెత్తున జరిగింది. దీనివల్ల నవీన నాగరికతకు మార్గమేర్పడింది. అనువాదం ఆధునిక ప్రపంచ సాహిత్య నాగరికత అని గ్రహించాలి. ఒకే భాషలో పాండిత్యంగలవారు అనువాద గ్రంథాల ఆధారంగా తులనాత్మక అధ్యయనం ప్రారంభించ వీలవుతుంది.

ఈ సందర్భంగా అనువాదాన్ని గురించి రెండు మాటలు చెప్పాలి. మాతృ భాష చదివితే వచ్చే అనుభూతిని అనువాదంలో అనువాదకుడు కల్గించాలి. అనువాదం ఒక యజ్ఞంలాంటిది. మూల రచనలోని సౌందర్యానికి, సున్నితత్వానికి హాని కలగకుండా చేయాలి ఆయా భాషలలో గల శైలిని, నుడికారాన్ని, తమతమ భాషల్లోకి అందంగా మలచుకోగలగాలి. అనువాదకుడు ఆయా భాషా సాంప్రదాయాల్ని, జీవన విధానాన్ని, వారి ఆచార వ్యవహారాలను తెలుసుకోవాలి. మూల విధేయంగా సౌందర్యం చెడకుండా అనువదించాలి.

మనదేశంలో — 'National Book Trust of India వారు, కేంద్ర సాహిత్య అకాడమి వారు "Indian literatures is one though written in many languages" అన్న డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి సూక్తి ననుస రించి వివిధ భాషలలో అనువాద గ్రంథాలు అందిస్తున్నారు. తులనాత్మక అధ్యయనానికి అనువాదం ఆయువుపట్టు.

వివిధభాషా వ్యవహర్తల మధ్య సయోధ్య పెరగాలన్నా, సాహితీ సంస్కృతులు మరింత వృద్ధిపొందాలన్నా తులనాత్మక అధ్యయనానికి అను వాదంతోపాటు ద్విభాషా, త్రిభాషా, బహుభాషా, అంతర్జాతీయ నిఘంటువులు శాస్త్రీయంగా ఆధునికంగా రూపొందించాల్సిన అవసరం కూడా ఉంది. నిఘంటువులవల్ల మాతృభాషా సాహిత్యం కూడా పెరుగుతుంది. తెలుగులోని - ఆంధ్ర, తమిళ, కన్నడ త్రిభాషా నిఘంటువుల వంటివి ఎన్నో రావలసిన ఆవశ్యకత ఉంది ఉత్తమ అనువాదాలు, బహుభాషా నిఘంటువులు తుల నాత్మక అధ్యయనానికి ఆయువు పట్టువులు. అనువాద విభాగాలను తుల నాత్మక అధ్యయనశాఖకు అనుసంధించవచ్చు.

## అధ్యయన ఆవశ్యకత

ఈనాడు తులనాత్మక అధ్యయనం ఎంతో అమూల్యమైంది. అవసర మైందికూడా. రెండు భాషల నడుమనేగాక, ఒక భాషలోనే రెండు అంశాల గూర్చి తులనాత్మకంగా అధ్యయనం చేయవచ్చు. భాషాశాస్త్రరంగాల్లో పరిశోధన విస్తృతంగా జరుగుతూంది "దేశకాలాల నిమిత్తంలేకుండా సార్వత్రిక దృక్పథంతో సాహిత్యాన్ని గురించిచేసే ప్రతి ఆలోచనా తుల నాత్మక సాహిత్యంలో అంతర్భాగమవుతుంది "5 అయితే ఇది శాస్త్రీయంగా ఉండాలి ప్రపంచ సాహిత్యమంతా ఒకే జాతికి చెందిందన్న అవగాహన కలుగుతుంది తన ప్రాదేశిక పరిధిదాటి ప్రతివాడు తులనాత్మక పరిధిలోకి రావడానికి వీలవుతుంది.

ఒకరి రచనలు మరొకరు 'బేరీజు' వేసుకోవడంవల్ల ఎన్నో రహస్యాలు తెలుసుకొనే వీలుంటుంది. అన్యభాషా సాహిత్యాధ్యయనంవల్ల మన భాషల లోని రచనల స్థాయి ఏమిటోకూడా మనకు తెలుస్తుంది. మన లోపాలను

పరిత్యజించి, ఇతరభాషలలోగల మంచిని గ్రహించే అవకాశం ఏర్పడుతుంది. తద్వారా జాతీయ, అంతర్జాతీయంగా ఎదగడానికి వీలవుతుంది. సాహిత్యాల మధ్యనేగాక, చారిత్రక, సాంస్కృతిక, సంప్రదాయాలమధ్య తులనాత్మక అధ్యయనం జరిగితే జాతీయతా భావం పరిపుష్టమౌతుంది. నానా భాషా సమైక్య దృష్టి, గౌరవభావం కలుగుతుంది. మాక్సుముల్లరు చెప్పినట్లు తులనాత్మక పరిశీలనంపైనే ఉన్నత విజ్ఞానం ఆధారపడి ఉంటుంది.

"తులనాత్మక పద్ధతిలో భారతీయ సాహిత్యాలన్నింటిని అధ్యయనం చేయడంవల్ల జాతీయసమైక్యతకూ, భావసమైక్యతకూ దోహదపడుతుంది "6 వివిధభాషల స్వరూప స్వభావాలు తెలుసుకోవడంవల్ల ఇతర భాషలపై సదభిప్రాయం కలుగుతుంది. విశ్వమానవతా భావన పెరుగుతుంది. సంకుచితత్వం పోయి, విశాలదృష్టి ఏర్పడుతుంది. జాతీయ, అంతర్జాతీయ సాహిత్య సాంస్కృతిక రంగాలలో పరిచయం పెరగడం వల్ల వసుదైక కుటుంబ భావన బలపడుతుంది. మానవులంతా ఒకటేననే జాతీయతాభావం, భాషల లిపి వేరైనా భావం ఒకటేనని తెలుసుకోవడంవల్ల జాతీయసమైక్యతకు, సమగ్రతకు బాటవేసినట్లవుతుంది.

భారతదేశం - సంస్కృతి - భారతీయులంతా ఒకటేననేభావం బలపడుతుంది. భారతీయ భాషలలో భాషా పరివేషం తొలగిస్తే ఒకే రకమైన స్ఫూర్తి, చైతన్యం, భావన కల్పన, ఆంతర్య నిరూపణ అన్ని భాషలలో స్పష్టంగా కనిపిస్తుంది. ఏ ఒక్క భాషా సమగ్రం కాదు. అన్నిభాషలు, సంస్కృతి కలిస్తేనే సమగ్రమౌతుందని తెలుస్తుంది. ఒకరి సాహిత్యాలను, చరిత్రను, సంస్కృతిని మరొకరు గౌరవించే వీలుకలుగుతుంది. వివిధ రంగాలలో ఇతర భాషావ్యవహర్తలు సాధించిన ఘనవిజయాలను పోల్చిచూచే అవకాశం ఏర్పడుతుంది. వీటన్నింటివల్ల జాతీయ భావము బలపడి జాతీయసమైక్యతకు హేతువు కాగలదు. తులనాత్మక అధ్యయనం జాతీయసమైక్యతకు భారతీయ సంస్కృతిని పోషించడానికి; సమైక్యతా సాధనకు సులభసాధనం.

## భారతీయ భాషల్లో తులనాత్మకత - స్థూలపరిచయం

భారతీయ భాషలలో "భాషాపరివేషం తొలగిస్తే ఒక సమాన స్ఫూర్తి, చైతన్యం, భావన, కల్పన, ఆంతర్యనిరూపణము స్పష్టంగా కానవస్తాయి"6

ఒక ప్రాంతంలో ఒక స్వరం వినిపిస్తే దాని ప్రతిధ్వని వేరొక ప్రాంతంలో వినవస్తుంది.

అన్నమయ్య రచనల వెనుక ఆళ్వారుల భక్తిభావం పునాదిగా ఉంది. అన్నమయ్య ప్రేరణ కన్నడ హరిదాస ఉద్యమ సాహిత్యంలో కనిపిస్తుంది. భారతీయ భాషలలో రామాయణ రచన మధ్యయుగాలలోనే జరిగింది వీటన్నింటిలో ఎంతోకొంత అవాల్మీక అంశాలున్నాయి. తమిళ తిరుక్కురళ్' కన్నడ బసవ వచనాలు తెలుగు పాల్కురికి సోమన కృతులలో భావ సామ్యత కన్పిస్తుంది. వేమన-సర్వజ్ఞాల రచనలలో సామ్యం ప్రస్ఫుటంగా చూడవచ్చు.

పంపభారతం నన్నయ భారతం రెండూ భిన్న లక్ష్యాలతో ప్రారంభ మైనా భాషల సాన్నిహిత్యంవల్ల పంపభారత ప్రభావం నన్నయ భారతం మీద శైలిలో రచనలో కానవస్తుంది.

భారతీయ భాషలన్నింటిలో ఇంచుమించు ఒకేసారి ఆధునికయుగం ఆరంభమైంది. సాంస్కృతిక పునరుజ్జీవన ప్రభావం వల్ల సంఘ సంస్కరణ, దేశభక్తి, పురావైభవ సంస్మరణ, జాతీయోద్యమం వంటి ఉద్యమాలు సాహిత్యారంగాన్ని ప్రభావితం చేశాయి. ఆధునిక ప్రక్రియలన్నీ భారతీయ భాషలన్నింటిలో వికాసం చెందినవి. రాజకీయ, సామాజిక, భక్తి ఉద్యమా లన్ని సాహిత్యంలో సమానంగా ప్రభావితం చేయడం తులనాత్మక పరిశీలనలో మనం గమనించవచ్చు.

ఈశతాబ్దం ఉత్తరార్థం ప్రారంభంనుండి మాత్రమే భారతీయ సాహిత్యంలో తులనాత్మక సాహిత్యాధ్యయనం ప్రారంభమైంది. కేంద్ర సాహిత్య అకాడమి, నేషనల్ బుక్‌ట్రస్ట్, భారతీయ జ్ఞానపీఠ్ మొ॥ సంస్థలు అనువాదాలద్వారా తులనాత్మక అధ్యయనాన్ని ప్రోత్సహించాయి. భారతదేశం వంటి పలుభాషలున్న దేశంలో అనువాదాల ద్వారా తులనాత్మక అధ్యయనం బహుముఖంగా సాగవలసి ఉంది. ఈ రంగంలో విశ్వవిద్యాలయాలు తమ వంతు కృషిని ప్రారంభిస్తున్నాయి. శ్రీ వేంకటేశ్వర, శ్రీకృష్ణదేవరాయ, మైసూరు, బెంగుళూరు, మద్రాసు,మధురై కామరాజ్ వంటి విశ్వవిద్యాలయాలలో

దక్షిణభారత సాహిత్యాలపై తులనాత్మక అధ్యయనం కొనసాగిస్తున్నారు. తులనాత్మక అధ్యయనం అక్కడక్కడ గోష్ఠులు నిర్వహిస్తున్నారు. ప్రముఖులచే ఉపన్యాసాలిప్పిస్తున్నారు. నూతనంగా ఏర్పడిన తెలుగు విశ్వ విద్యాలయం ప్రత్యేకంగా తులనాత్మక అధ్యయన శాఖను ఏర్పాటుచేసి డిగ్రీ స్థాయిలోను, స్నాతకోత్తర స్థాయిలోను, తులనాత్మక సాహిత్య అధ్యయనం ఒక అంశంగా ప్రవేశపెట్టేందుకు సన్నాహాలు చేస్తూంది. ఇది అభినందనీయం.

భాషావేత్తలైన పుట్టపర్తి నారాయణాచార్యులు, చల్లా రాధాకృష్ణశర్మ ఆర్. వి. యస్. సుందరం, తం. వేం. సుబ్బారావు, గంధ అప్పారావు,, జి. నాగయ్య, కె. సర్వోత్తమన్, జి. లక్ష్మీనారాయణ వంటివారు ఈ రంగంలో అనేకవ్యాసాలు, గ్రంథాలు అందిస్తున్నారు. అనువాద గ్రంథాలు ఆధారంగా కొందరు తులనాత్మక సాహిత్య పరిశోధనలు సాగించినారు. మరి కొన్ని పరిశోధనలు సాగుతున్నాయి.

జానపద సాహిత్యంలో తులనాత్మక అధ్యయనం కొంత జరిగింది. ఆచార్య ఆర్. వి. యస్. సుందరంగారు తెలుగు కన్నడ జానపదగేయాలపై తులనాత్మక పరిశీలన చేశారు. తెలుగు తమిళ జానపద గేయాలపై డాక్టర్ టి. నిర్మలగారు తులనాత్మక వ్యాసాన్ని అందించారు. తెలుగు, తమిళ సామెతలపై సి హెచ్ రవికుమార్, తెలుగు కన్నడ సామెతలపై పి. యస్. గోపాల కృష్ణగారు తులనాత్మక పరిశీలన గావించినారు. శిష్ట జానపద గేయాలలో వర్ణనలగురించి జి. వెంకట బసవ నరసింహారావుగారు తులనాత్మక పరిశీలన చేసినారు. తెలుగు కన్నడ జానపద రామకథా గేయాలపై టి. గోపాలకృష్ణ రావు తులనాత్మక పరిశీలన గావించినారు. ఈ విధంగా జానపద సాహిత్యం తులనాత్మక అధ్యయనంలో కొంతముందుంది. అయినా ఇంకెంతో జరగ వలసి ఉంది.

దక్షిణభారత భాషలలో 'వేమన - సర్వజ్ఞుడు - తులనాత్మక పరిశీలన' అనే అంశంపై ఆచార్య గంథం అప్పారావుగారు, పంప - నన్నయ భారతాలపై బయ్యా రత్నావళి, దక్షిణభాషల్లోని ఛందోరీతులపై ఆచార్య కె. సర్వోత్తమన్, అన్నమయ్య - ఆళ్వారులపై డాక్టర్ జె. మునిరత్నం,

'తెలుగులో విప్రనారాయణ కథ - తులనాత్మక పరిశీలన' అంశంపై ఈ వ్యాసకర్త' తమిళాంధ్ర భారతములపై వి. యస్. రాఘవన్, తెలుగు కన్నడ సాహిత్యాలలో కుమారరాముని కథ పై ఎం. వేదవతి, అభిమన్యు బాలచంద్రులపై టి. రామచంద్రరావు తులనాత్మక వ్యాసాలు సమర్పించినారు. ఇవన్నీ కేవలం దాక్షిణాత్య సాహిత్యాలపై స్థూలంగా జరిగిన తులనాత్మక పరిశీలనాంశాలు మాత్రమే.

ఆచార్య బయ్యా సూర్యనారాయణగారు తెలుగు - హిందీ భాషల్లో గద్య సాహిత్య వికాసం గురించి, తెలుగు ప్రాకృత వ్యాకరణాలపై బేతవోలు రామబ్రహ్మంగారు తులనాత్మక పరిశీలన గావించినారు. ఇంకా తెలుగు - ఉత్తరభారతదేశ భాషలకు తులనాత్మక అధ్యయనం జరగవలసి ఉంది. మనరాష్ట్రంలో హిందీశాఖలో తులనాత్మక సాహిత్య అధ్యయనం కొంత ఎక్కువే జరిగింది. 'సూరదాసు - పోతన', 'జయశంకర్ ప్రసాద్ - విశ్వనాథ' మొ॥ అనేక అంశాలపై తులనాత్మక వ్యాసాలు వచ్చినవి. ఇంత వరకు జరిగిన పరిశోధనలలో ఎక్కువభాగం స్థూలదృష్టితో జరిగినవి మాత్రమే. ఇంకా సూక్ష్మదృష్టితో తులనాత్మక పరిశోధన జరగవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

సాహిత్యాంశాలేగాక, జాతీయ, అంతర్జాతీయ కళల వికాసంపై, మత పరిణామాలపై, జానపద కళలపై, సామాజిక ధర్మాల గురించి, రాజకీయ పరిణామాలపై కూడా తులనాత్మక అధ్యయనం బలాన్ని పుంజుకోవాలి. జాతీయ భావాలను ప్రతిఫలించే విధంగా, జాతీయ అవసరాల కనుగుణంగా ఉన్న ఈ తులనాత్మక విద్యా విధానం జాతీయ విద్యా విధానంలో భాగం కావాలి. ఒక బోధనాంశంగా కూడా చేర్చాలి. అందుకు అటు ప్రభుత్వం, ఇటు విశ్వవిద్యాలయాలు ముందుకు రాగలవని ఆశిద్దాం.

## అధస్సూచికలు

1. ఆచార్య జి. యన్. రెడ్డి, ప్రవేశిక, దాక్షిణాత్య స
2. డా. జి. లక్ష్మినారాయణ, తెలుగువాణి, పుట 43.

3. ఆచార్య ఎం. సుబ్బారెడ్డి - తెలుగు విశ్వవిద్యాలయం వారికి చేసిన సూచన.

4. గుంటూరు శేషేంద్రశర్మ - తులనాత్మక సాహిత్యము, కొర్లపాటి శ్రీరామమూర్తి అభినందన సంచిక పుట. 2.

5. డా. జి. లక్ష్మీనారాయణ, తెలుగువాణి, పుట. 43.

6. ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య తులనాత్మక సాహిత్యము, కొర్లపాటి శ్రీరామమూర్తి అభినందన సంచిక పుట. 84.

## పరిశీలించిన పుస్తకాలు


1. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష, ఆచార్య జి. నాగయ్య
   ప్రొఫెసర్, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి (1976)

2. తెలుగువాణి - మూడవ అఖిలభారత తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక.
   తెలుగు విశ్వవిద్యాలయం - హైదరాబాదు. (1990)

3. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి షష్టిపూర్తి అభినందన సంచిక తులనాత్మక సాహిత్యము.
   అభినందన సమితి - విశాఖపట్టణము (1989)

# జాతీయ కవులు భారతి గరిమెళ్ల తులనాత్మక పరిశీలన

జాతీయోద్యమ ప్రభావితులై తదనుగుణమైన కవిత్వ సృష్టికి విక్రమించిన జాతీయ కవులలో తమిళ సాహిత్యంలో సుబ్రహ్మణ్య భారతి, తెలుగు సాహిత్యంలో గరిమెళ్ళ సత్యనారాయణ సుప్రసిద్ధులు. వీరి జీవితంలోను, రచనల లోను ఎన్నో సామ్యాలు కన్పిస్తాయి. వాటిని తులనాత్మకంగా పరిశీలించడం ప్రస్తుత కర్తవ్యం.

సుబ్రహ్మణ్య భారతి 1882 లో డిశంబరు 11 న మద్రాసు రాష్ట్రంలో తిరునెల్వేలి జిల్లాలోని వట్టమాపురం గ్రామంలో జన్మించాడు. గరిమెళ్ళ శ్రీకాకుళం జిల్లా, నరసన్న పేట తాలుకా, గోనెపాడు గ్రామంలో 1898 లో పుట్టాడు. ఇరువురూ మధ్యతరగతి కుటుంబీకులు. లేమినీ బాధలను భరించిన వారు. బ్రతికినన్నాళ్ళూ ధనాభావంతో బ్రతికిన వారు. భారతి తన 39వ యేట, గరిమెళ్ళ తన 59 వ యేట ఇద్దరూ మద్రాసులోనే కాలధర్మం చేశారు.

భారతి, గరిమెళ్ళ ఇద్దరూ కొంతకాలం ఉపాధ్యాయులుగా పని చేశారు. మదురలోని సేతుపతి ఉన్నత పాఠశాలలో భారతి తమిళ పండితుడుగాను, విజయనగరం ఉన్నత పాఠశాలలో గరిమెళ్ళ ఉపాధ్యాయుడుగాను కొంత కాలం గడిపారు. ఇరువురూ పత్రికా రంగంలో ప్రవేశించారు. భారతి మద్రాసులోని 'స్వదేశమిత్రన్' పత్రికా కార్యాలయంలో చేరి, ఆ తర్వాత స్వయంగా కొన్ని పత్రికలు నడిపారు. గరిమెళ్ళవారు కూడా కొంతకాలం 'గృహలక్ష్మి', 'ఆంధ్ర ప్రభ'లలో ఉప సంపాదకులుగా పని చేశారు. త్రిలింగ మొదలైన

పత్రికలకు రాజకీయ వ్యాసాలు వ్రాశాడు. శారదా గ్రంథమాల పెట్టి పుస్తక ప్రచురణ చేశాడు. కాని ఇవి కలసి రాలేదు.

నవ్య సాహిత్యం రావాలని ఆశించిన జాతీయ కవు లిద్దరూ ఇతర భాషలపై ఆదరణ కలవారు. భారతికి తెలుగు భాషన్నా, తెలుగు వారన్నా ఎనలేని అభిమానం. తెలుగు సుందరమైన భాషగా పేర్కొన్నాడు.

'విరియ గాచిన వెన్నెల రాత్రిలో
చేర దేశపు చెలులు వెంటరా
సుందరాంధ్ర పదమ్ము పాడుచున్
సింధు నదిని పడవ నడుపుచు నాడుదాం'1

'సుందరాంధ్ర పదముచు పాడుచు సింధునదిలో నౌకా విహారము చేయవలె నట ఎంత మధుర కల్పనమిది. 'చంద్రిక' అనే కథలో కందుకూరి వీరేశ లింగం పంతులు గారిని ఆయన ప్రస్తుతించారు. అదే విధంగా పోతన కవిని త్యాగరాజును ప్రశంసించాడు. ఆంగ్లంలో కూడా కవితా రచన చేశారు.

గరిమెళ్ళవారు బహుభాషావేత్తలు తమిళం, కన్నడం, ఆంగ్ల భాషలు తెలుసు. మహాకవి తిరువళ్ళువర్ రచించిన 'తిరుక్కురళ్' వంటి అనర్ఘ రత్నాన్ని తెలుగు చేయగలిగినంత భాషా పాండిత్యం కలవారు. తమిళ నీతి గ్రంథమైన "నాలడియారుపి" (చతుష్పది)ని తెనిగించాడు. తమిళ గీతాలు కూడా ఆలపించేవారట. కన్నడం కూడా బేకుమళ్ళ అచ్యుతరావుగారి దగ్గర నేర్చుకొని "తళ్ళికోట" అనే కన్నడ నాటకాన్ని అనువదించాడు. ఆంగ్లంలో కూడా కొన్ని రచనలు చేశాడు. "హార్ట్ ఆఫ్ ది నేషన్" అనే పద్య కావ్యం వ్రాశాడ. "ది ఎకనామిక్ కాంక్వెస్ట్ ఆఫ్ ఇండియా" అనే ఆంగ్ల గ్రంథాన్ని 'భరత ఖండము పైని ఆర్థిక విజయము' అనే పేరుతో తెనిగించారు. అది 1938 లో ముద్రితమైనది.

భారతి - గరిమెళ్ళ యిరువురు గేయ కవులు, సంగీత జ్ఞానం కలవారు. జానపద బాణీలు ఇరువురకూ తెలుసు. ఇరువురి రచనలు జాతీయ వాదులను ఉత్తేజితులను చేసి స్వాతంత్ర్యోన్ముఖులను చేశాయి. ఇరువురూ వ్యావహారిక భాషను ప్రోత్సహించారు. తమిళ సాహిత్యమందు నవయుగం భారతితో

ప్రారంభమైందనుకోవచ్చు. వీరిరువురి గేయాలు పండిత పామరరంజకాలు. గేయ వాఙ్మయాన్ని సుసంపన్నం చేసినవారు. వీరివంటి జాతీయ కవులు ఆనాడు లేరనుట అత్యుక్తిగాదు. ఇరువురు జాతీయ గేయ రచనలవల్ల కారాగార శిక్ష ననుభవించిన స్వాతంత్ర్యయోధులు. వీరిరువురి భాషలు వేరైనా వీరి రచనలలోని భావం ఒకటే.

భారతి దేశభక్తి కవితలు (జాతీయ గీతాలు), స్తోత్ర గీతాలు, తాత్త్విక గేయాలు, కన్నయ్య పాటలు, కోయిల పాటలు, ఇంకా కొన్ని వచన కవితలు వ్రాశారు. గరిమెళ్ళ వారు స్వరాజ్యం పాటలు, సహాయ నిరాకరణోద్యమ పాటలు, భక్తి కీర్తనలు, హరిజనుల పాటలు, నూతన జాతీయ గీతములు (1926), కొన్ని రాజకీయ వ్యాసాలు వ్రాసినారు. గరిమెళ్ళ ఆలపించిన "మాకొద్దీ తెల్ల దొరతనం - దేవా, మాకొద్దీ తెల్ల దొరతనం" అనే గేయం సుప్రసిద్ధమైంది. దేశభక్తి కవిత మూలంగా జైలు శిక్షకు శ్రీకారం చుట్టిన వారు గరిమెళ్ళ. బ్రిటిషు కాలంలో ఈ పాట పాడిన వారికి కూడా కారాగార శిక్ష లభించింది. ఇరువురు దేశభక్తి నిండినవారు. జాతీయ నాయకుడైన గాంధి మహాత్ముని సిద్ధాంతాలను నమ్మిన వారే.

భారతి - గరిమెళ్ళ ఇరువురూ భారత దేశాన్ని అఖండ భారతంగా భావించారు. జాతీయ సమైక్యతకు ప్రాధాన్యమిచ్చి రచనలు చేశారు. ఎవరెన్ని చెప్పినా మన మందరం ఒకటే జాతి, అదే భారత జాతి అని పేర్కొన్నారు. ఇతరుల జోక్యాన్ని నిరసించారు.

"ఎన్నో జాతులు మనలో ఉండేను
ఏమది న్యాయం ఇతరుల జోక్యం
ఒక తల్లి పిల్లలు కలహించుకున్న
అన్నదమ్ములే వారెన్నటికి" -
అని భారతి చెప్పగా[2]
"ఎవరెన్ని చెప్పిన హిందూ దేశవాసు
లేక సోదరులెసుండి
అన్నదమ్ముల్లోన భేద
మాడు పెట్టాడండి బాబూ"[3] - అని గరిమెళ్ళ వారు అన్నారు.

అఖండ భారతాన్ని అభిలషించినా, దురదృష్టవశాత్తు దేశ విభజన తప్పలేదు. ఆ బాధ "చీలికలు" అనే ఖండికలో గరిమెళ్ళ వారు —

''అఖండ హిందూస్థాన స్వప్నం
ఆఖరు కిట్లదుగంటింది.
పాకిస్థానుకు ముస్లిము లీగు
.... ... .... ... ... ....
బ్రిటీషు వారి ప్రతిభను చూస్తే

విధాతకే అచ్చెరువవుతోంది"4 - అని తమ ఆవేదనను వ్యక్తం చేశారు.

ఇరువురూ భక్తిగీతాలు కూడా వెలయించారు. దైవస్తుతి చేసినా అందులో కూడా దేశాభిమానం కానవస్తాయి.

''ఎన్నటి తణియు మింద సుదందిర దాహం" — అనే కృష్ణ స్తోత్రం లోని పాదాలను పరికించండి.

"ఎప్పుడు తీరు నీ స్వాతంత్ర్య దాహం
ఎప్పుడు మడియు మా అడియరి మోహం
ఎప్పుడు మా తల్లి సంకెల లూడి పోవు
ఎప్పుడు మా యిక్కట్టులన్ని తీరిపోవు5''

అని తపించారు.

అలాగే — విఘ్నేశ్వర స్తోత్రంలో తన జీవిత లక్ష్యాలను ఇలా తెలియ చేశాడు.

''కవిత, దేశసేవ, క్షణ కాలమైనను
బద్దకమ్ము లేని — పనులనంగ

ఇవియె నాకు మనస — ఈ మూడు చేయుము అపుడు సదయుడగును ఆ గణపతి !''6

భారతిలో కనిపించే జాతీయ దృక్పథ మట్టిది.

గరిమెళ్ళ వారు గణేశస్తుతిలో —

ప॥ "శ్రీ గణేశ నిన్ను నమ్మితిరా సకలాగమ సన్నుత
చ॥ భోగ రాగము లెల్లమాని
విరాగినై నీ పాదయుగ్మ పదాంబుజంబులె మదిని నమ్మితి
సర్వశుభములు ఈ జగంబును చక్కగా నెరవేరగా
గర్వముడిగి అఖండ జన సంఘము లెల్లయు గూడగా"7 ॥శ్రీ గణేశ॥

గర్వం తొలగి సర్వ శుభములు కలగాలని కాంక్షించాడు. అందరూ ఏకం కావాలనే భావన కూడా తొంగి చూస్తుందీ గేయంలో.

భారతి, గరిమెళ్ళ కూడా భగవంతునిపై భక్తి విశ్వాసాలు కల్గినవారని ధ్వనివలన వ్యక్తమైంది.

భారతి ప్రదర్శించిన దేశాభిమానం విస్మరించరానిది. ప్రతి రచనలోనూ దేశాభిమానం, మానవత దృష్టి ప్రధానంగా కనిపిస్తాయి. ఆయన ఒకచోట చెప్పిన మాటలు తిలకించండి.

"క్రైస్తవులైనా, పార్శీలయినా, మహమ్మదీయులైనా, ఎక్కడ నుండి వచ్చి యేదైవాన్ని పూజించినా భారతదేశంలో పుట్టి పెరిగి యీ దేశాన్నే నమ్ముకున్న వారినందరినీ భారతీయులుగానే భావించాలి. ఇది ఏక జాతి. విభజించరానిది. నాశనం లేనిది."8

ఇటువంటి అణిముత్యంవంటి ఆలోచన గలవారు భారతి. భారత జాతి అనే గేయంలో - భారతి కవి

"అందరూ భారతీయులు
అందరూ సమానులు, సమధర్ములు
అందరూ ఈ దేశపు రాజులు
మనమందరం ఈ దేశపు రాజులం"9 — అన్నాడు.

ఎప్పటికైనా స్వరాజ్యం సిద్ధిస్తుంది, ప్రజాస్వామ్యం ప్రభవిల్లుతుందనే భావంతోనే "మనమందరం ఈ దేశపు రాజులం" - అని సహేతుకంగా పేర్కొన్నాడు.

దేశాభిమానం సహజంగా గల భారత కవి — దేశభక్తి ప్రబోధాత్మకములైన గీతాలెన్నో సంతరించినాడు. 'స్వాతంత్ర్య దాహము' అనే గేయంలో —

"ఏనాడు చల్లారు – స్వాతంత్ర్య దాహము
ఏనాడు తీరు మా — దాస్యపు మోహము
ఏనాడు మా తల్లి — చేతి సంకెలు వదలు
ఏనాడు మా తాప — మింకి సుఖము పొరలు"10

అని స్వరాజ్యం కోసం పరితపించిన జాతీయ కవి భారతి.

"వందే మాతర మందము — మన
మందరు కూడి భజింతము
జాతిమతంబులు గనము — మేలి
జన్మమీదేశాన సమకూరె గావున
జాతి విప్రులైన నేమిః వేఱు
జాతివారైనను జన్మ యందొక్కడే"11

అని సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని చాటినారు. భారతి కవి వందేమాతరం, 'జయ భారత గీతాలు' నిండుగా గంభీరంగా వుంటాయి.

'స్వాతంత్ర్య ఘనత' అనే గేయంలో భారత కవి స్వాతంత్ర్యం తప్ప తక్కిన దేదీ తృప్తినీయజాలదన్నారు. చూడండి.

"వీరస్వాతంత్ర్యము - వేడువారు పిదప
వేఱొండు కైకొందురే - ఎన్న
డారంగ నమృతము - నాను నానగలుగ
హా! కల్లు నాసింతురె!
పుట్టిన వారలు - గిట్టుట నిజమును
గుట్టెరిగినవారలు - తగఁ నెట్టి మానము పిడి
పట్టి ప్రాణమ్ముల నిలుపుట మేలందురే."12

అమృతము కోరేవారు తుచ్ఛమైన కల్లు నాశింపరు గదా! ఆత్మ తత్వం తెలిసిన జ్ఞానులు దేహానికై ప్రాకులాడరు గదా!

దేశీయ పతాక అనే శీర్షికలో —

"భారత జనని జెండా
తేరి తెలిచి వినుతింతము రండీ
మూడు రంగుల పతాక - అట
ముచ్చటైన రాట్నపురేక
మేడం వెలిగెను జోక - దాని
నీడల సుఖముగ నిలుతము రండీ"13 అని పిలిచారు.

"జగముల నెల్లడ - స్వాతంత్ర్య కాంక్షను హత్తిన" వెదవిత్తిన జాతీయ కవి భారతి. గాంధీజీని ప్రస్తావిస్తూ "మహాత్మగాంధీ పంచకం"లో "అస్వతంత్ర మైన భారతాన్ని బ్రతికించడానికి అరుదెంచిన "మహాత్మా! నువ్వు వర్ధిల్లాలి-" అంటూ గాంధీజీని ప్రస్తుతించాడు. ఇట్లే గురు గోవిందసింగును, తిలక్, మన జాతీయ గౌరవాన్ని ఇనుమడింపజేసిన శివాజీ వంటి ప్రముఖులకు ప్రస్తుతించారు.

"మనదేశం" అనే కవితలో భారతి మన దేశ ప్రశస్తిని ఇలా కీర్తించారు.

"భారత వీరులు వరలిన దేశం
మునులెందరో నివసించిన దేశం
నారదగానం వినిపించిన దేశం
మంచిని ఎప్పుడు పెంచే దేశం
తీరని జ్ఞానం భాసించిన దేశం
బుద్ధుని కరుణా పొంగిన దేశం
భారత మెంతో పురాతన దేశం
పాడెద మెప్పుడు దాని ప్రశస్తిని"14 — అంటూ ఆ దేశాభిమానాన్ని చాటినాడు.

"భారతమాత శుభనామము జపించండి, జపించండి
విద్వేషాంతర్వహ్నిని జయించండి, జయించండి"—అని ఉద్బోధించాడు.

భారతి ఆవేశ పూరితంగా వ్రాసిన తన దేశభక్తిగీతంలో భారతదేశ స్వరూపాన్ని సాంస్కృతిక సంపదలను, ఉజ్వల భవిష్యత్తును ప్రస్తుతించినారు. వీరిరువురి కవితలో ప్రకృతి ప్రశంసకూడా ఉంది. వీరిరువురూ వేర్వేరు భాషలలో కవిత్వం వ్రాసినా వీరిభావం ఒకటే. ప్రకృతిలోని దివ్య సౌందర్యాన్ని దర్శించికొని రచనలు చేశారు. అవి ముగ్ధ మనోహరములు.

"వేదం వెలసిన దేశమిది - వీర
వరులూ ప్రభవించిన దేశం
అఖండ హిందూసానమిది - దైవ
మునే సేవింపుము పాపా "—16 అని బాల బాలికల నుద్దేశించిన

పాటలలో కూడా జాతీయతను చాటినాడు.

"వాళియ భారత మణిత్తిరునాడు" (వర్ధిల్లాలి శ్రీలు పొంగే భారతం) అని కలలుగన్న భారతి ఆదర్శపురుషుడు. దేశచరిత్రలో వారి స్థానం మహోన్నతమైంది.

భారత కవి వలె గరిమళ్ళ కవి కూడా, మూర్తీభవించిన దేశభక్తుడు. జాతీయోద్యమ ప్రపూరితాలైన రచనలెన్నో చేశారు. జనతను మేల్కొలిపినారు. తెల్లవారి గుండెలదర గొట్టారు. ఆయన వ్రాసిన 'స్వరాజ్యగీతం' "మా కొద్దీ తెల్లదొరతనము'' అందరినీ ఆకట్టుకుంది. చూడండి

"మాకొద్దీ తెల్లదొరతనము - దేవ
మాకొద్దీ తెల్ల దొరతనము
మా ప్రాణాలపై పొంచి మానాలు హరియించె ॥మా॥

పన్నెండు దేశాలు పండుచున్న విగాని
పట్టెడన్నము లోపమండి
నోటమట్టిగొట్టి పోతాడండి
ఆడి కుక్కలతో పోరాడి
కూడుతినమంటాడు ॥16 మా కొద్దీ తెల్ల దొరతనం ॥

సుదీర్ఘ గేయమిది. ప్రభుత్వ దమననీతిని, నిరంకుశత్వాన్ని, జాతీయ పతాక ప్రశావాన్ని, మహాత్ముని నాయకత్వాన్ని, ఐకమత్యాన్ని ఈ గేయంలో ప్రబోధం గావించారు. తిరుగులేని స్థానాన్ని సంపాదించి పెట్టిందీ గేయం. ఆయన వ్రాసిన స్వరాజ్య గీతాలన్నీ శక్తిసంపన్నాలే. 'నూతన జాతీయ గీతములు' అనే సంకలనంలో - ప్రబోధాత్మకత కూడా కన్పిస్తుంది. ఆచార్య యమ్. సుబ్బారెడ్డిగారు పేర్కొన్నట్లు "ఈయన కవితల్లో మతవైషమ్య నిరసన, మద్యపాన నివారణ, స్వదేశీ వస్త్రస్వీకరణ, మహాత్ముని మార్గాను సరణ, స్వాతంత్ర్య సముపార్జన, మాతృదేశ సంకీర్తన మున్నగు విషయాలు మహోన్నతంగా రూపుదిద్దు కున్నాయి."17 వీరి గేయాలన్నీ ప్రజలలో చైతన్యం కల్గించాయి.

గాంధీజీ అనుచరుడు కావడం వల్ల గరిమెళ్ళవారి గీతాలలో గాంధీజీ సందేశం ప్రధానంగా కన్పిస్తుంది. ఆయన "జాతీయ గీతములు" అనే పుస్తకంలో వ్రాసిన "కల్లుపాట" పేరుతో వ్రాసిన 32 పాదాల పాటలో

"కల్లుతాగి నీయిల్లు నెల్ల గుల్లచేయకు
నీ వళ్ళు రోగాలకెల్ల వడ్డి కీయకు
పిల్ల జెల్లలను తెచ్చి వీధి పెట్టకు - ముసలి
తల్లి తండ్రులను ఐట్టి తన్నికొట్టకు"
క్రుళ్ళిత్రోవలను నీవు తూలిపాడకు - బుద్ధి
వల్లకాట కలిపియవమాన మొందకు.18

అని హితవు పలికినాడు. దురభ్యాసాలను దూరంచేసినపుడే దేశీయులకు ముక్తి అని మహాత్ముని సందేశాన్ని కళ్ళకు కట్టినట్లు చెప్పినాడు.

గరిమెళ్ళవారు వ్రాసిన హరిజనుల పాటలలో తన ఆవేదను వ్యక్తం చేసిన విధంచూడండి.

''హరిజనులము మనము - దుఃఖములనుభవించమికను
సరిసమముగ తక్కినజాతులతో సంస్తుతినందుదము

స్నానములాడుదము దేహము - స్వచ్ఛముచేయుదము
భయమును మానుదము దేశభక్తి పూనుదము'' [19]

తక్కినవారితో సమంగా మన్నన పొందడానికి కాబోలు 'హరి జనులము మన'మన్నాడు. న్యూనతా భావాన్ని త్యజించి దేశభక్తిని పూను మని కర్తవ్యబోధచేశాడు. గాంధీజీ సిద్ధాంతాలకివి కలికి తురాయివంటివి.

గరిమెళ్ళవారి సూక్తులు కొన్ని పాఠకులను సైతం అలరించేవిగా ఉన్నాయి. మచ్చునకు కొన్ని-

1 "తెల్ల దొరల సేవచేస్తూ కాలం గడపడం
నల్లని మచ్చగా భావించండి''

2. ''నిమ్న జాతుల నెత్తు మోయి - వారు
సీరసించిన యెడల నిక నీకు గోయి''

3. "ప్రేమచేతనే పగతుని గెలుతము
ప్రజల ప్రేమయే మాకు దిక్కండి"

4. "కలసివున్నపుడే కలదు సుఖం''

5. "దేశ కళల నెల్ల తేజరిలచేద్దాము
పాటక జనమునకు పనులు కల్పిద్దాము".[20]

ఈ విధంగా జాతీయ స్ఫూర్తితో రచనలు చేసిన గరిమెళ్ళవారు ఘనులు. దేశభక్తి మూర్తీభవించిన మహామనిషి. జాతీయవాది, అభ్యుదయ భావాలుగల రచయిత కావుననే వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిలుగారు

"తెలుగు దేశంలో సుబ్రహ్మణ్య భారతి అని చెప్పదగినవాడు (గరి మెళ్ళ) సత్యనారాయణగారు" - అని అన్నారు.

ప్రజలలో చైతన్యం కల్గించి దేశభక్తి ప్రబోధంతో జనతను మేల్కొలి పిన భారతి, గరిమెళ్ళ కవులిద్దరూ ధన్యజీవులు. చిరస్మరణీయులు.

# అధస్సూచికలు

# ఉపయుక్త గ్రంథాలు

(1) గరిమెళ్ళ సాహిత్యం - చల్లా రాధాకృష్ణశర్మ
లక్ష్మీనారాయణ గ్రంథమాలా ప్రచురణ
(1989) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ హైదరాబాదు.
(2) తమిళవిందు - చల్లా రాధాకృష్ణశర్మ
(వాఙ్మయసంపుటి) (1986)
మదురై కామరాజ్ యూనివర్సిటీ, మదురై - 625021.
(3) దక్షిణ భారత సాహిత్యము ఆం. ప్ర. సాహిత్య అకాడమి
హైదరాబాదు.
4. తెలుగు జాతీయోద్యమ కవిత్వం ఆచార్య ఎం. సుబ్బారెడ్డి

# అక్క మహాదేవి మీరాబాయి

# తులనాత్మక పరిశీలన

ఎక్కడి అక్క మహాదేవి, ఎక్కడి మీరాబాయి వీరిద్దరూ ఒకరు దక్షిణం మరొకరు ఉత్తరం. వీరు ఒకరు 12వ శతాబ్దికి మరొకరు 16వ శతాబ్దికి చెందినవారు. వీరిద్దరికి సామ్యమేమిటి ? తులనాత్మక పరిశీలన మేమిటి? అని అనుకోవచ్చు కాని మనసుంటే మార్గముండక పోదు. ప్రపంచ సాహిత్యమంతా ఒకే జాతికి చెందిందన్న భావన, దేశ కాల ప్రాంత నిమిత్తం లేకుండా సార్వత్రిక దృక్పథంతో పరిశీలించడం నేటి తులనాత్మక సాహిత్యానికి ప్రాతిపదికలు. ఈ దృష్టితో చూస్తే కన్నడ దేశంలో ప్రసిద్ధి చెందిన కవయిత్రి, మహాభక్తురాలు అక్కమహాదేవికి, ఉత్తర భారత దేశంలోని భక్తురాలు, కవయిత్రి మీరాబాయికి అనేక సామ్యాలు కనిపిస్తాయి. ఒకరిది శైవభక్తి మరొకరిది కృష్ణభక్తి. అయినా భక్తిభావం ఒకటే గదా !

అక్క మహాదేవి, మీరాబాయి ఇరువురూ భక్తి దరువులను తాకినవారే. భక్తికి పరాకాష్ట, పరమాత్మలో ఐక్యం చెందడం. అక్కమహాదేవి, మీరాబాయి ఇరువురూ తమతమ ఇష్టదైవాలైన శివున్ని, కృష్ణుని ప్రసన్నం చేసుకుని సాయుజ్యాన్ని పొందిన పుణ్యచరితులు. ఇరువురూ గృహిణులుగా బాధలు అనుభవించినవారే. ఇరువురూ తమ తమ ఇష్ట దైవాలనే భర్తలుగా భావించి మధుర భక్తిచే తరించినవారు. సుందరమైన రూపు, మధురస్వరం గలవారు. మధురప్రేమతో వీరిరువురు తమ తమ ఇష్ట దైవాలపై మధుర గీతాలు రచించారు. మీరాబాయి కీర్తనలు భక్త్యమృత బిందువులు. అక్కమహాదేవి వచన

ములు భావగాంభీర్యం, లయ విన్యాసంగల గీతాలు. ఇన్ని సామ్యాలున్నం నసే దక్షిణ భారత, ఉత్తర భారత దేశ కవయిత్రుల తులనాత్మక పరిశీలన అవసరమైంది.

అక్కమహాదేవి (క్రీ. శ. 1160) కన్నడ సాహిత్యంలో బసవయుగానికి చెందిన భక్తురాలు మహిళా శివ శరణులలో అగ్రగణ్యురాలు తత్త్వజ్ఞ శిఖామణి. ఆమె జీవిత విశేషాలను, చరిత్రను బాలపాపాంబ అనే కవయిత్రి యక్షగానంగా మార్చింది. కన్నడంలో శ్రీ సంజప్పగారు వ్రాసిన "తత్త్వజ్ఞ శిఖామణి అక్కమహాదేవి'' చరిత్రను తెలుపే చక్కని పుస్తకం. పూజ్యులు లింగానంద స్వాములవారు (బెంగుళూరు) "అక్కన ప్రవచన పేరుతో" అక్కమహాదేవి గురించి చేసిన ప్రసంగాలు గ్రంథరూపంలో ప్రకటించబడ్డాయి. ఆమె వ్రాసిన ''వచనములు, యోగాంగ త్రివిధి" మొ॥ గ్రంథాలు కూడా ఆమె జీవిత చరిత్రకు ఆధారాలు.

అక్కమహాదేవి పార్వతీదేవి సాత్త్విక కళగా భూతలంలో అవతరించిందని పిడువర్తిసోమన పేర్కొన్నారు. తల్లిదండ్రులామెకు పెట్టినపేరు మహాదేవి.

కలికంఠు భామిని కళగాన బరగ
తెలివ కిడికి మహాదేవి యన్నేరు

'అక్క' అన్నది కర్ణాటకలోను, రాయలసీమలోను గౌరవ వాచకం అల్లన ప్రభువు, అక్క అనేది బిరుదిచ్చి గౌరవించాడు. నాటినుంచి 'మహాదేవి' అక్కమహాదేవిగా ప్రసిద్ధికెక్కింది. కర్ణాటకలోని 'ఉడుతడి' గ్రామానికి చెందింది. అక్క మహాదేవి సుమతి, నిర్మల శెట్టియను సదాచార దంపతులకు పుట్టిన పట్టి. రూప లావణ్యాలుగల సుగుణవతి. చిన్ననాటనే ఆమెకు అఖండ శివభక్తి, సౌశీల్యం అలవడ్డాయి. పరిపూర్ణ తత్త్వజ్ఞానం, వైరాగ్యం, సాహిత్య కళ ఆమె బాల్యంలో బీజరూపంలో ఉండేవి. ఆమె తేజస్సు సుగుణ సంపద, నవవికసిత కుసుమ పరిమళంలాగా అందరినీ ఆకర్షించేది.

ఒకనాడు ఆ ఊరు అధిపుడు కౌశికుడు, ఆమెను చూచి సౌందర్యానికి మోహితుడై వివాహమాడ సంకల్పించాడు. అతని కోరిక నెల్లించకున్నచో

ఆమె తల్లిదండ్రులకు ప్రమాదమని భయపడి మూడునియమాలకు అవరోధం కలిగించకుంటే, రాజభవనం ప్రవేశిస్తానని నియమభంగం కలిగిన వెంటనే తాను రాజభవనం నుండి వెళ్ళిపోతానని తెలియచేస్తుంది. ఆమె విధించిన షరతులలో మొదటిది శివలింగపూజకు భంగం కలిగించకుండుట, రెండోది గురుజంగముల దాసోహము, మూడోది అనుభవ గోష్ఠికి అంతరాయం కలిగించకుండుట. కౌశికుడు తొలుత అంగీకరించాడు. కాని కామోద్రేకంచేత తానంగీకరించిన నియమాలకు అచిరకాలంలోనే అవరోధం కలిగించడమేగాక, తన కామేచ్ఛను తీర్చుకొనుటకు ఒకరోజు ప్రయత్నించాడు. అంత మహాదేవి కోపోద్రేకములో ఛీ! పశువా! నన్ను విడువుమని వదిలించుకుని కేశాంబరియై "చావు బ్రతుకుల మగడు నాకెందుకమ్మా! చావులేని చెడుపులేని చెన్న మల్లికార్జునిని కూడి సుఖముండెదనని" తల్లితండ్రులకు తెల్పింది. "హరునకు నాదేహ మర్పించినాను; గురునాదు గన్నాన బోదునని" సర్వసంగపరిత్యాగియై చెన్న మల్లికార్జునుని యందు అనన్యభక్తితో కల్యాణ కటకము చేరి, అందలి 'అనుభవ మంటపము'లో చక్రవర్తి చెన్న బసవన్నను, అల్లమ ప్రభువును చూచింది. అల్లమ ప్రభువు ఆమె వైరాగ్య తత్వజ్ఞానాన్ని పరీక్షించి, మెచ్చుకొని "అక్క" అను గౌరవ పదమునిచ్చి తత్త్వోపదేశమిచ్చాడు. తదుపరి శ్రీశైలం పోవుటకు అల్లమ ప్రభువు అనుజ్ఞ వేడగా—" శ్రీశైల క్షేత్రమందలి కదళీవనమందు చెన్న మల్లికార్జునుని ధ్యానించుచు అచ్చట ఐక్యమగుము. పొమ్మని" సెలవిచ్చాడు. అదే ప్రకారం శ్రీశైల క్షేత్రమందలి కదళీవనమందు ఏకాంతంగానున్న ఒక గుహయందు శివుడే సర్వస్వమని భజించి, శివయోగ ధ్యానమందుండి శివలింగైక్యమందెను. ఇప్పటికీ శ్రీశైలం సమీపంలోని కదళీవనంలో అక్క మహాదేవి గుహను చూడవచ్చు. కదళీవనమందు శ్రీశైల చెన్న మల్లికార్జునుడు అక్క మహాదేవిని తనలో ఐక్యం చేసుకునే దృశ్యం గల విగ్రహాన్ని చూడవచ్చు. ఈ విధంగా అక్క మహాదేవి మహాభక్తురాలై తరించింది.

## మీరాబాయి

శ్రీకృష్ణ భక్తి రెండు మార్గాలలో ప్రబలింది. ఒకటి రుక్మిణీ సహితుడైన శ్రీకృష్ణుని పూజించడం. మరొకటి రాధా సహితుడైన శ్రీకృష్ణుని పూజిం

చటం. శ్రీ వల్లభాచార్యులు, శ్రీ చైతన్య స్వామి మొ॥వారు రాధా సహితుడైన శ్రీకృష్ణుని పూజించే భక్తి మార్గానికి చెందినవారు. రాధాకృష్ణుల ప్రేమ మధుర భక్తి మార్గానికి దారి తీసింది. మధుర భక్తిచే తరించిన మహాభక్తురాలు. మీరాబాయి రస పుత్రాంగన.

మీరాబాయి రాజపుటానాకు చెందిన చిన్న సంస్థానమైన మెడ్‌టాకు ప్రధానియైన రావు దుదాజీ మనుమరాలు. రత్నసింగ్ రాథోర్ కుమార్తె. క్రీ. శ. 1499 లో చౌకాది గ్రామంలో జన్మించింది. ఈమె తాతగారు గొప్ప కృష్ణ భక్తులు. తమ ఇంటికి తరచుగా వచ్చే భక్తుల, సాధుల, సన్యాసుల యొక్క నిత్య సందర్శన ప్రభావం మీరాబాయిని శ్రీకృష్ణ భక్తురాలుగా చేసింది. బాల్యం నుండియే కృష్ణుని పూజిస్తూ ఆతని యందధికారం గలదైనది.

ఉదయపురి యొక్క మహారాణా భోజరాజుతో ఈమెకు వివాహమైంది. ఈమెకు తన వివాహానంతరము కూడా శ్రీకృష్ణ భగవంతుని యందున్న భక్తి భావం తగ్గలేదు. ఈమెకు వివాహమైన కొలది కాలానికే దురదృష్టవశాత్తు భర్త మరణించాడు. నాటినుండి ఆమెకు శ్రీకృష్ణ భగవానుడే సర్వమైనాడు. ఆమె యొక్క భక్తి తత్పరత పెరిగింది. ఐహిక వాంఛ ప్రవృత్తులను సంపూర్ణంగా త్యజించి ఉన్నత స్థితికి చేరి, "గిరిధర గోపాలుడు నావాడు, ఇతర ప్రాపంచక విషయాలు మిథ్య" యని తలచి కృష్ణ సంకీర్తన, సంస్తుతి మాత్రమే శాశ్వతమైనదని భావించేది. ఆమెకు కృష్ణప్రేమ, కృష్ణభక్తి ప్రపంచమే ప్రపంచము.

మీరాబాయి మరది విక్రమాదిత్య రాణా ఆమె భక్తివైఖరి చూచి తమ కుటుంబానికి అప్రతిష్ఠాకరమని భావించి వదినగారిని శ్రీకృష్ణ భక్తి నుండి మనస్సు మరల్చేందుకు సర్వ విధాల యత్నించినాడు. ఆమార్గము వదిలేయాలని బలవంతం చేశాడు.

మీరాబాయియే ఈ సందర్భంలో
"అబ్ తో బాత్ ఫైల్ గయా జానే సబ్ కోయీ !
దాస్ మోరాలాల్ గిరిధర్ హోసీ హోయీ ।"[2]

ఇపుడు ఈ సంగతులన్నియు బాగా వ్యాపించిపోయెను. అందరికీ తెలిసింది. అయినదేదో అగుగాక మీరా, గిరిధర ప్రభుని బంధనయందు మాత్రమే ఉన్నది - అని స్పష్టంగా తేల్చి చెప్పెను. కృష్ణభక్తి నుండి మరల్చడానికి వారు చేసిన ప్రయత్నం నిష్ఫలమైంది. చివరికి ఆమె ప్రాణాలు తీయడానికి కూడా మూడుసార్లు యత్నించారు. మూడుసార్లు కూడా శ్రీకృష్ణ భగవానుడు రక్షించినాడని ఐతిహ్యం.

విక్రమాదిత్య రాణా మూర్ఖత్వంచె కల్గించే బాధలు పడలేక మీరాబాయి అత్తవారిల్లు వదలి ప్రశాంతంగా శ్రీకృష్ణ భక్తిభావంలో గడిపేందుకు 'మేడ్‌టా' లోని స్వగృహం చేరెను. కాని అచ్చట కూడా ఆమెకు శాంతి లభించలేదు. అందువల్ల అక్కడినుండి శ్రీకృష్ణ భక్త్యారాధనకు ప్రధాన కేంద్రమైన బృందావనం చేరింది. అటుతర్వాత గుజరాతులోని శ్రీకృష్ణజన్మ స్థానం ద్వారక చేరెను. మధురనగరిలో ప్రశాంత చిత్తయై, భక్తి తత్పరు రాలై ఆమె చరమ దశనంతా అక్కడనే ప్రశాంత చిత్తంతో కృష్ణపరమాత్మను కీర్తిస్తూ గడిపింది.

"శుద్ధ అద్వైతమును ప్రచారము గావించి భగవంతుని దయానుగ్రహము లను పొందిన వారు గోలోకము (కృష్ణలోకము) నకు వెళ్ళుదు"రని, వల్లభా చార్యులు 16వ శతాబ్దంలో ప్రతిపాదించినాడు. మీరాబాయి ఈ మార్గాన్నను సరించి భగవంతుని ప్రియునిగా ప్రేమించి ఆరాధించి అనన్య భక్తిచే "గోవిందుడే నా ఆత్మ" అంటూ అతడే సర్వస్వంగా యెంచి ఆ ప్రభువు లీలను వర్ణిస్తూ ఒక ప్రియునివలె ఆరాధించేది.

"కలియుట నేను కోరుచున్నాను ప్రియ
కలిసెద వెప్పుడో యీ వినీత దాసిని"3

అని కృష్ణుని ప్రార్థించేది. సదా ఆ స్వామికోసం తహతహలాడేది. ఉన్నత రాజవంశానికి చెందిన ఘోషా కూడా త్యజించి, శ్రీ కృష్ణతత్వాన్ని తెలుసు కోడానికి సాధువుల, సభాసమావేశాలకు వెళ్ళేది. శ్రీ కృష్ణ పరమాత్మ ధ్యాస లోనే కాలం గడిపేది. ద్వారకా నగరిలో శ్రీకృష్ణ పరమాత్మపై అనేక మధుర గీతాలను ఆలపిస్తూ ఆ స్వామియందే లీనమైంది. మధుర భక్తిచే తరించిన మహాభక్తురాలు మీరాబాయి.

## అక్క మహాదేవి మీరాబాయి రచనలు (సాహిత్య ప్రతిభ)

ఇరువురూ మధుర భావంతో ముక్తిని సాధించినవారేగాక గొప్ప సాహిత్య నిర్మాతలు కూడా. అక్క మహాదేవి వచించిన 'వచనములు' కన్నడ వచన వాఙ్మయంలో మిక్కిలి ఉన్నత స్థానాన్ని పొందాయి. "వచన మంటే గద్యమనే అర్థంకాదు. అటు గద్యము, ఇటు పద్యమూకాని భావ గీతాలు వచనాలు. శివకవులు సాధనంగా ఉపయోగించుకున్న నూత్న సాహిత్య ప్రక్రియ"4 అక్క మహాదేవి వచనములలో స్పష్ట వాక్యత, ఉదారదృష్టి అడుగడుగున గోచరిస్తాయి. ప్రతి వచనము చివర ఆయా వచనకారుల ఇష్టదైవముల పేర్లు మకుటంగా ఉంటుంది. అక్క మహాదేవి వచనములకు 'చెన్న మల్లికార్జున' అన్నది మకుటం. ఇవి కన్నడ సారస్వతంలో సుప్రసిద్ధాలు.

అక్క మహాదేవి వచనములందు ఆమె శ్రీశైల చెన్న మల్లికార్జునిని అనన్య భక్తితో వలచి, ప్రేమించి, భజించి ఆ స్వామియందే ఐక్యమైన వివరాలున్నాయి. అక్క మహాదేవి వచనములలో "శివపరమైన మధుర భక్తి, జ్ఞాన వైరాగ్యాలు సదాచారములు, షట్ స్థలముల బోధ కన్పిస్తాయి. ఇది ఆమె యందలి విశిష్టత. ఈమె వచనములు భావ గాంభీర్యం, విషయ నిరూపణం, లయ విన్యాసాలు గల గీతాలు."

అక్క మహాదేవి 'వచనములు' మాత్రమే గాక యోగాంగ త్రివిధి, సృష్టీయ వచన, మొ॥ రచనలున్నాయి. యోగాంగ త్రివిధి 67 అను ప్రాత నియమాలు త్రిపదుల గలది ఇందు తత్త్వశాస్త్ర విషయములు, ఆమె జీవిన చరిత్రకు సంబంధించిన విశేషాలు, గురువుపై గల భక్తి ప్రతిపత్తులు చూడవచ్చు. 'సృష్టీయ వచన' ఒక బృహద్గ్రంథం. వీరశైవ మతానుసారంగ ఈ గ్రంథంలో సృష్టి విధానము. శరీర ప్రవృత్తి, జీవాత్మ ప్రకృతి మొ॥ విషయాలు చక్కగా వర్ణింపబడ్డాయి.

గుజరాతి, హిందీ సాహిత్యాలలోనే గాదు అఖిల భారతీయ సారస్వత క్షేత్రాలలో మీరాబాయి గేయాలకు గల స్థానం అద్వితీయం. మీరాబాయి కవితను గూర్చి ప్రస్తావించుచు డా. "టెస్సిటరీ" - "ఆమె ప్రాచీన పశ్చిమ రాజస్థానీ భాషయందు కైత నల్లెనని పేర్కొని యుండెను. కాని మీరాబాయి

తనంతట తానై ఏ భాషయందును వ్రాసి యుండక పోవచ్చును. కాని ఆమె గేయాలు, పద్యములు, ఏ భాష వారు వాడిన నా భాషలో నున్నవి." అంతటి విశిష్టతను, వ్యాప్తిని పొంది యున్నవి. ఆమె గేయములన్నీ భావోద్రిక్తమైనవి. సహజ సుందరాలు అక్క మహాదేవి దాదాపు 250 వచనములు వ్రాసినట్లే మీరా దాదాపు 250 గీతములు వ్రాసినారు. మీరాబాయి శ్రీ కృష్ణుని లీలావతారాలను "మీరాకే ప్రభు గిరిధర్ సాగర్" అనే మకుటంతో, రేయిం బవళ్ళు పాడేది. ఆమె మధుర గీతాలు నెరుంగని వారరుదు. ఆమె దైవదత్తయైన గానమాధుర్యాన్ని విన్న వారిని తన్మయుల్ని చేస్తుంది. ఆమె భక్తి గీతాలు నేటికి దేశమంతా గానం చేస్తున్నారు. ఆమెను స్మరిస్తూ జోహార్లర్పిస్తున్నారు.

ఈమె రచించిన పదములు, పాటలు, పద్యములన్నియు బ్రిజ్ భాషా మరియు హిందీ భాష లందున్నవి. పెక్కు భాషలలోకి తర్జుమా చేయబడ్డాయి.

## మీరాబాయి రచనలు

1. నెర్సీజీకి మాయియా
2. గీత గోవింద కిటీకా
3. రాజ్ గోవింద్
4. మీరాకి పదాఁయే (మీరాపదములు)
5. మీరాకి గెల్సి
6. పాటలు - మొదలైనవి

మీరాబాయి కీర్తనలు ముక్తికి సోపానాలు.

## అక్క మహాదేవి, మీరాబాయి మధురభక్తి

నవవిధ భక్తి మార్గాలలో ఏ రకంగానైనా భగవంతుని సేవించి తరించవచ్చునని భాగవతం చెప్తుతుంది. ఏ మార్గానికి చెందినదైనా భక్తి భావం ప్రధానం. భారతీయుల భక్తి సాంప్రదాయాల్లో మధుర భక్తి సర్వోత్కృష్టమైంది. గోపికాదుల ప్రేమ వంటిది. "భగవంతుని పురుషునిగా తన్ను తాను ప్రేయసిగా భావించి పూజించేది మధుర భక్తి. అక్క మహాదేవి ఈశ్వరునే భర్తగా భావించి, మీరాబాయి శ్రీ కృష్ణుని భర్తగా భావించి మధుర భక్తిచే తరించారు. వారిద్దరి రచనలలో కనిపించే మధుర భక్తి భావాన్ని పరిశీలిద్దాం.

అక్క మహాదేవి "సర్వం శివమయం జగత్" అని నమ్మి ఆ స్వామి సర్వ వ్యాపకత్వాన్ని, అనన్య భక్తితో వర్ణించేది.

"వనమంతయు నీవే, వనమందలి తరులతలన్నియు నీవే
తరులందాడుచున్న ఖగ మృగములన్నియు నీవే
చెన్న మల్లికార్జునా సర్వభరితుండవై యుండియు
నా కెందుకు నీ ముఖమును జూపవయ్యా"5

అని పరమేశ్వరుని సర్వ వ్యాపకత్వాన్ని తెల్పి నాకెందుకు నీ ముఖము చూపకున్నావని ప్రశ్నించేది.

అంతా శివమయమైనా సాధనచేగాని భగవంతుని ఉనికి తెలుసుకోలేము. భగవంతుని ఉనికిని అక్క మహాదేవి ఒక వచనంలో ఇలా చెప్పింది -

"నేలమరుగుననున్న నిక్షేపమువలె
ఫలము మరుగుననున్న రుచివలె
శిలల మరుగుననున్న హేమమువలె
తిలలు మరుగుననున్న తైలమువలె
తరువు మరునగునున్న తేజము వలె
భావము మరుగున బ్రహ్మయైయున్న
చెన్న మల్లికార్జుని ఉనికి తెలియరానిది"6

దీన్నిబట్టి ఈశ్వరుని ఉనికి సామాన్యులు తెలుసుకోవడం కష్టం. అయినా ఆ స్వామికి అంతా అర్పించి అన్య చింతలేక ఉండే భక్తులకు సులభుడవుతాడు. అందుకే అక్క మహాదేవి

"కాయమును ముడుపు గట్టి మీ కర్పించితిని
కరణాదుల ముడుపు గట్టి మీ కర్పించితిని
నేనొకటియు నెరుగనయ్యా!
నాగతి నీవే నా మతి నీవే ఐనందుకు
నా ప్రాణము నీ కర్పితమయ్యెను

గాక వేరొకటి దలచిన
ఆన నీయాన చెన్నమల్లికార్జునా!"7

అన్య చింతన లేక ఉన్నానని ఆ పరమేశ్వరునికి విన్నవించింది.

మీరాబాయి కూడా శ్రీ కృష్ణ ప్రభువే సర్వంగా నమ్మి, విషయాసక్తిక బంధాలను వదలి అంతా ఆ శ్రీ కృష్ణ పరమాత్మయేనని అత్యంత ఆనం పారవశ్య మనుభవించేది - అట్టి కీర్తన ఒకటి -

"మోహనః నీ ముఖ సౌందర్యముచే
మోహితనై ఆ కృష్ణనైతిని
ఓ శ్యామల నీవే నా కలంకారము,
నీవే నా సౌందర్యము
నీవే నా ధనము, నా సర్వస్వము"8

అని అన్యచింతనలేక యుండేది. స్త్రీలకు అలంకారాలు ప్రీతి పాత్రమైన మీరాకు అలంకార ప్రియుడైన శ్రీ కృష్ణుడే శోభనాలంకారాలు. ఆ సాధ్వి భక్తి భావ మట్టిటి.

అక్క మహాదేవి శ్రీ చెన్న మల్లికార్జునుని పతిగా వలచి, ఆ స్వామికై పరితపించి, విరహవేదన ననుభవించేది. ఆ విషయాన్ని తెల్పే వచనము -

"చావులేని చెడుపులేని రూపులేని
సుందరునినే వలచితినమ్మా
ఎడలేని కడలేని తెరలేని గురుతులేని
సుందరుని వలచితి నో యమ్మలారా
భవము లేని భయము లేని నిర్భయ
సుందరుని వలచితి నేను
కులసీమలులేని సుందరుని వలచితి
చెన్న మల్లికార్జునుండను మగని
[illegible] వలచితినో యమ్మలారా!"9

శివుని వలచి పతిగా భావించింది మధుర భక్తి తత్త్వమిట్టిది.

తన మాన ప్రాణాలన్నీ స్వామియేనని తెల్పే వచనము -

"తనువు మీరూపైన నేనెవరిని సేవింతు
మనసు మీరూపైన నేనెవరిని తలంతు
ప్రాణము మీరూపైన నేనెవరిని పూజింతు
జ్ఞానము మీరూపైన నేనెవరి నరయుదు
చెన్నమల్లికార్జునా నీనుండి నీవే యైనందున
నిన్నే తెలియుచున్నానయ్యా."10

అని తన అనన్య భక్తిని చాటింది. ఆ భక్తాగ్రగణికి ఆ పరమ శివుడు తప్ప యితరమైన దేదీ రుచించదు కాబోలు. అందుకే ఆ స్వామి కానరాకున్న విరహాన్ని అనుభవించేది చూడండి

"కలవరపడిన మనసు తలక్రిందులయ్యెనమ్మా
చల్లగ వీచిన గాలి అగ్ని జ్వాల యయ్యెనమ్మా
చల్లని వెన్నెల తీక్షమగు ఎండగ మారెనమ్మా
నగర సుంకరి వలె తిరుగుచున్నానమ్మా
తగుబుద్ధిని చెప్పితో దైవమ్మా."11

చెన్న మల్లికార్జునకు రెండవ దన్న కోపమమ్మా - అని ఆ పరమ శివునిపై గల విరహబాధను భక్తితో చాటింది.

"లింగా నామనస్సంత నీయందు చెరునయ్యా" - అని పలికింది. ఆ పరమేశ్వరుని రావయ్యా అంటూ ఆర్తితో - ప్రియంగా పిలిచింది.

ఆవిషయాన్ని తెలిపే వచనము —

"పసుపు పూసుకొని పసిడి సొమ్ముల బెట్టుకొని
పట్టుబట్టల గట్టికొంటి పురుషా రావయ్యా
పురుషరత్నమా రావయ్యా
నీరాకడ ప్రాణము : రావె మనసు

చెన్న మల్లికార్జునయ్యా రావయ్యా
నీ వొచ్చెదవని దారి చూచిచూచి
నోట తడియూరి బడలితి నయ్యా."12 అని వలపు భావంలో విన్న వించేది.

అక్క మహాదేవి స్వామికోసం కలలుగనేది.
ఆవిషయాన్ని తెల్పే వచనము —
"చెలీ వినవే వినవే నొక కలగంటి
నొక జోగీ గిరిపై కూర్చున్నది కంటి
చిన్న చిన్న జడలు చక్కని పల్వరుస గల
జోగి వచ్చి నన్ను కూడెను చూడవే
అతని అబ్బుకొని సదమద మైతినే
చెన్న మల్లికార్జునుని గాంచి
కన్నుమూసి తెరచి అచ్చరు వొందితి."13
అని స్వప్నభావాన్ని తెల్పేది.
"నేడు నాయింటికి మగడొచ్చెను చూడమ్మా
మీరు మీరందు సిద్ధముగంద్రు
చెన్నమల్లికార్జునుడిప్పుడే వచ్చును
ఎదురు కొందము రండో యమ్మలారా."14

అని సఖులను పిలిచేది. ఈ విధంగా మధురభక్తి భావంతో శివునికై పరితపించినట్లు అక్క మహాదేవి వచనములు తెలియచేస్తున్నాయి.

మీరాబాయి కూడా శ్రీకృష్ణపరమాత్మ ముఖారవింద సందర్శన భాగ్యం కోసం తహతహ లాడేది. సుకుమార చిత్తోన్మాదము ననుభవించేది, విరహ బాధకూడా ఆమె గీతములలో ధ్వనిస్తూంటుంది.

మచ్చునకొకటి —
"ఉన్మత్త నైతి నీదర్శ నోత్కంఠతో
ఒంట పెఱుకయే గాదు ఈ బాధ అది యెట్టిదో"

"నిఖిని సుఖముల త్యజియింప
అఖిల నాయక తగునె మూరియింప"
నిన్ను విడువంగ జాలను పవలు రేలు
''తృష్ణద్యజియించితిన్ బవలురేలు
"కంటి పావకు కాంతి రేఖ వగుచు
కంటి వెలుగుగ నుంటి వోహోహా కృష్ణ !"
"బ్రతుకు శూన్యమ్ము శూన్యమ్ము ప్రభువులేక."[15]

అని ఈ గీతాలలో తెలియ జేసింది ''గాయపడినవారి స్థితి గాయ పడినవారికే తెలుస్తుంది." మీరా తన వియోగ దుఃఖాన్ని వర్ణించే ఇట్టి గేయా లెన్నో, మీరా గేయాలలో కనిపిస్తాయి. ఆ వియోగబాధను వర్ణించేటపుడు కృష్ణప్రభుకు తనకు నడుమగల అవినాభావాన్ని, అద్వైతభావాన్ని గూర్చి కూడా ఒత్తిపలుకును. రెండు వియోగహృదయాల యందలి అభిరతిని. బాధను, కాంక్షను, విచారాన్ని ఆమె తమ గీతాలలో వర్ణించెను. శ్రీకృష్ణ భగవానుడామె గృహమున కేతెంచి ఆమెతో ఆడి పాడినటులూహించి ఆమెకు కల్గిన అతీతమైన ఆనందాను భూతిని కూడా ఆమె కొన్ని పదాలలో వర్ణించింది,

అక్కమహాదేవి తన దైవాన్ని, లీలలను చేష్టలను వివరిస్తూ వ్రాసిన వచనములనేకం ఉన్నాయి. అందులో ఒకటి

"తన వినోదమునకు తానె పుట్టించెను సకలజగత్తును
తన వినోదమునకు తానె ఇట్టించెను సకల ప్రపంచమును.
తన వినోదమునకు తానె తిరిగించెను, అనంత భవదుఃఖములలో
ఇట్టి నాచెన్న మల్లికార్జునుడను పరమశివుడు
తన జగద్విలాసము చాలైనదోమరల

తానే మాయాపాశమును ఛేదించును."[16] అని శివుని లీలా విశేషాన్ని వర్ణించేది.

ఇంకా —

"శివ శివా

ఆది అనాది యను రెండును లేని నిరవయవ శివా!
నీ నిజము నెవరయ్యా తెలిసినవారు?
వేదముల కభేద్యుడవు - శాస్త్రముల కసాధ్యుడవు
పురాణములకు పుణ్యుడవు
ఆగమముల కగోచరుడవు
తర్కమునకు అతర్క్యుడవు వాఙ్మనా
తీతుండవగు పరమ శివలింగమవు."17

అని పరమేశ్వరుని ఆధిక్యాన్ని వర్ణించేది.

మీరాబాయి కూడా తన ప్రియమైన కృష్ణుని ముగ్ధ మోహనాకృతిని, చిలిపి చేష్టలను భావించి తనలో తానే మైమరచి మురిసి పోయేది. అట్టి కీర్తన ఒకటి చూడండి-

"ప్రియు చకోరిక కూయిడె, పింఛమెత్తి
నెమలి క్రేంకార మొనరించె నెమ్మితోడ
ముద్దు కోయిల పాడెను హద్దు మీరి (ముద్దుగులుక)
మెఱసె సౌదామినీ ప్రభ మింట రాధ
ఉరుము లురిమెను నన్నీతు నురిమి చూచి
పిల్లగాలులీయ లివులనెల్ల మోసె
పిల్ల తుంపురు సాగెను మెల్ల - మెల్ల
నీదు భ్రుకుటి యెకొని తెచ్చె నిటకు నన్ను
కొంగు తడపెను కాంచవే కోమలాంగి
అనుచు రాధను బులిపించు నందగాడు
మనసు హరియించు నెప్పుడు గొనబు గులుక"18

అని తన కృష్ణుని చేష్టలను, మోహనాకృతిని వర్ణించెను. మధుర భక్తికి యిట్టి వర్ణనలు ప్రేరకములు. నీతి బోధకములైన కొన్ని పద్యాలు కూడా రచించెను. ఇంకా మీరా తమ గీతాలలో విశ్వమోహనుడైన కృష్ణుని దివ్య సౌందర్యాన్ని మధుర వంశీరవాన్ని మనోహరముగా గానం చేసెడిది.

అక్క మహాదేవి పరమేశ్వరుడు తనతో కలసి మెలసి యున్నట్లు ఊహించిన గీతాలు చూడండి.

"నా తనువు చేర్చుకొనెనమ్మా
నా సుఖము నొప్పుకొనెనమ్మా
నా ఇరవును ఆశ్రమము జేసుకొనెనమ్మా

చెన్న మల్లికార్జునుని వలపుగలదానను."[19] — అని తనస్వామి పై గల మధుర భక్తితో తన వలపును వెల్లడించేది. శివునకు తనకు గల అవినా భావ సంబంధాన్ని వివరించేది.

"తెల్లవారగనె లేచి నిన్ను దలచెదనయ్యా
కనూడ్చి చాన్పి చల్లి నీ రాక కెదురు చూచెదనయ్యా
పచ్చని పందిరేసి నీ రాక కుంచితినయ్యా
ఓ దేవా! చెన్న మల్లికార్జునయ్యా నీవెప్పుడొత్తువయ్యా"[20]

అని పరమేశునికై ఎదురు చూస్తునట్లు పల్కిన వచనా లనేకం కనిపిస్తాయి.

"పాలు చేతబట్టి వెన్నకై వెదుక దగునే
లింగమును చేతబట్టి పుణ్యతీరములకు బోదగునె."[21]

అని తనలో దేవుడుండగా ఇతరత్రా వెదకటమెందుకని కూడా అంటుంది.

''నేనున్న ఫలమేమి చెన్న మల్లికార్జునా
నీవున్న జ్ఞానము లేకున్న"
''నేను నశించి నీవై నిలుచు విధమును
జూపుమయ్యా ఓ ప్రభూ!'[22]

అని వేడుకుంటుంది.

"లింగా! నామనస్సంత నీ యందు చేరునయ్యా!"[23]

అని ఆ స్వామిని చిత్తశుద్ధితో చేరడానికి ప్రయత్నిస్తుంది. ఈ విధంగా అక్క మహాదేవి మధుర భక్తి భావంతో పలికిన గీతాలనేకం కనిపిస్తాయి.

మీరాబాయి గీతాలలో కూడా — శ్రీకృష్ణ ప్రేమ ఒక్కటియే సత్యము, నిత్యమని తెల్పబడింది. మీరా రచనలతో గాని అక్కమహాదేవి వచనములలో గాని అలౌకిక ప్రేమ తప్ప, శారీరక వాంఛ కనిపించదు. అనౌచిత్యము కానరాదు

మీరాబాయి ఒక గీతములో నందకిశోరుని —

"నల్లనయ్యా - రావయ్య
నంద బాలక - రావయ్య
నాదు కనుల నిన్ను నిలుపుకొందు
నాదరించెదనయ్య నల్లనయ్యా"24

అని పిలిచెడిది.

ఇంకొన్ని గేయాలలో మీరా తానొక వ్రజనారియై మాధవుని అమ్మటకై పేరగాంద్రను పిల్చుచు అరచుచున్నట్లు వర్ణిస్తుంది.

"పనులు లేవె మాయింట గోపాల బాల
ఏల చేసేవు రాతేను - నందబాల''
"కృష్ణ దేవునకి బాధ తెలియదనుచు
తృష్ణ తీరక చేతులు నలుపుకొనియె గోపి."25

ఇట్టి పద్యాలు చదివిన మీరా మూర్తీభవించిన రాధయని తోచక మానదు. ఒక్కొక్కచో మీరా తాను శ్రీకృష్ణుని తల్లియైన యశోద పాత్ర ధరించి —

"తీసికొనుము గొంగళి, కఱ్ఱ తీసికొనుము,
మేలుకొల్పుమ జగతిని మురళి నూది
ముగ్ధ మోహన రాగాబ్ధి ముద్ర తేలి
మోహముం బాయు లోకమ్ము ముద్దుగుఱ్ఱ."26

అని కృష్ణుని హెచ్చరిస్తుంది. ఎంత మనోహర భావన మిది! ఇంకో సారి మీరా భగవంతుని ప్రియునిగా భావించి ఆరాధించేది. అతనితో సంగమం

పొందేందుకు తహతహలాడేది. మీరాలో ప్రశాంతత చోటుచేసుకున్నపుడు భావావేశం లేకుండా ఆ సాధ్వి ఇలా వల్కింది.

"జానూం తో తంతురే దేవల్, జానుం
తో తంతు, మారో హంసలా నానొం నే దేవళ్ జానంతో తంత్తురే''
"ఈ దేవ మందిరము పాతదై శిధిలమై పోవుచుండెను.

కాని యందలి హంస మాత్రము ఇంకా తరుణముగానే యుండెను."17 అనే భావంతో కీర్తించేది.

ఆమె అందందు సరళ వేదాంత తత్త్వాన్ని కూడా చెప్పేది. భావనా కృతి, సౌకుమార్యం, మాదుర్యం అనుకరింవ గలిగిన కవిత్వ కళ ఆమెది. అక్కమహాదేవి వలె వైరాగ్య ప్రవృత్తి కల యోగినిగా కూడా పరిణామం చెందినట్లు చెప్పుకోవచ్చు. మీరాబాయి అక్కమహాదేవి కవయిత్రులు అఖిల భారతదేశానికి అమూల్య ఆభరణాలు. దివ్య తారలు. దేశ,కాలం, భాషాస్థితులు వేరైనా భావ సామ్యత కలిగిన వ్యక్తులు, రచనలు కనిపిస్తాయని అక్కమహాదేవి మీరాబాయి తులనాత్మక అధ్యయనం వలన తేలింది.

## అధస్సూచికలు

1. అక్కమహాదేవి వచనములు. పీఠిక. పుట. 70.
2. అఖిల భారత కవయిత్రులు పుట. 244.
3. ,, 245.
4. కన్నడ సాహిత్య చరిత్ర పుట. 82.
5. అక్కమహాదేవి వచనములు పుట. 7.
6. ,, పుట. 1.
7. ,, పుట. 63.
8. అఖిల భారత కవయిత్రులు పుట. 239.
9. అక్కమహాదేవి వచనములు పుట. 67.

10. ,, పుట. 108.
11. ,, పుట. 112.
12. ,, పుట. 122.
13. ,, పుట. 123.
14. ,, పుట. 124.
15. అఖిల భారత కవయిత్రులు పుట. ∠45.
16. ,, పుట. 246.
17. అక్క మహాదేవి వచనములు పుట 98.
18. అఖిల భారత కవయిత్రులు పుట. 249.
19. అక్క మహాదేవి వచనములు పుట. 124.
20. ,, పుట. 126.
21. ,, పుట. 121.
22. ,, పుట. 51.
23. ,, పుట. 121.
24. అఖిల భారత కవయిత్రులు పుట. 241.
25. ,, పుట. 241.
26. అఖిల భారత కవయిత్రులు పుట. 242.
27. అఖిల భారత కవయిత్రులు పుట. 243.

## ఉపయుక్త గ్రంథాలు

1. అఖిల భారత కవయిత్రులు
ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ
ఆం. ప్ర. సాహిత్య అకాడమి. హైదరాబాదు (1965)

2. అక్కమహాదేవి వచనములు
అనువాదము
శివశ్రీ రేకళిగె మఠం వీరయ్య
శివానుభవ సమితి, 4-7-947, ఇసామియా బజారు
హైదరాబాదు (1982)

3. కన్నడ సాహిత్య చరిత్ర
రచయిత డా॥ ఆర్వీ యస్ సుందరం
ఆం. ప్ర. సాహిత్య అకాడమి, హైదరాబాదు (1977)

# కన్నడాంధ్ర సాహిత్యాలలో దేశిరచనలు తులనాత్మక పరిశీలన

ద్రావిడభాషలైన కన్నడాంధ్రములు ఇరుగు పొరుగు భాషలు. సాహిత్య పరంగాను, చారిత్రకంగాను, మత, సాంఘిక విషయాల్లోను తెలుగువారికి, కన్నడిగులకు చుట్టరికం ఉంది ఈ రెండు భాషలలోగల దేశిరచనలను, వాటి విశిష్టతను తులనాత్మకంగా పరిశీలించి, విశ్లేషించడం ప్రస్తుతవిషయం.

సాహిత్యం మార్గ, దేశి అని ద్వివిధాలు. మార్గ, దేశి విభాగం మొదట సంగీత పరంగాను, ఆవెనుక నృత్యపరంగాను, అటుపిమ్మట సాహిత్యపరం గాను నిరూపింపబడింది. సంగీతం. మార్గ, దేశియని రెండురకాలుగా విభ జింపబడింది. శార్ఙ్గదేవుని (క్రి. శ. 1230) సంగీతరత్నాకరంలో - బ్రహ్మా దులచే మార్గితమై, ఈశ్వరసమక్షంలో భరతాదులచే ప్రయోగింపబడేది మార్గ మని, ఆయాదేశములందు జనులకు హృదయరంజకమగునది దేశియని చెప్ప బడింది. అందే మార్గ, దేశి రాగాలను వివరిస్తూ నియమబద్ధమై శాస్త్రీయమైనది 'మార్గ' రాగమని, నియమరహితమైనది 'దేశి' రాగమని చెప్పబడింది.

ధనంజయుడు (క్రి. శ. 950) దశరూపకంలో నృత్యము 'మార్గ మని, 'దేశి' యని విభజించి, అందు పదార్థాభినయమైన నృత్యము 'మార్గ' మని, నృత్తము 'దేశి' అని తెల్పినాడు. దీన్ని ఆంగ్లంలోకి పరివర్తింపజేసిన ప్రొఫెసర్ హాస్‌దొర మార్గపద్ధతిని **Higher Style** అని, దేశి పద్ధతిని **Lower Style** అని వ్యవహరించినాడు. సంగీత, నాట్యములందలి మార్గ,

దేశి విభేదాలను భాషాపరంగా అన్వయించి, సంస్కృత భాష మార్గ విధానానికి దేశజనుల వ్యవహారమందున్న ప్రాకృత భాషలు దేశివిధానానికి చెందుతాయని కొందరభిప్రాయపడినారు.

సాహిత్యపరంగా మార్గ, దేశి కవిత్వాలను నిరూపించడానికి ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు - "నియమబద్ధమై, శిష్ట సమ్మతమును, శాస్త్ర సమ్మతమును అయి, ఉత్తమ పణితిని రచింపబడినది మార్గకవిత. నియమ రహితమై, శాస్త్రములకెక్కక కేవల ప్రజారంజకమునకై రచింపబడినది దేశి కవిత"[2] అని అభిప్రాయపడినారు. దీనివలన సంస్కృత, ప్రాకృతా దులతో ఎట్టి సంబంధం లేని దేశియభాష 'దేశి'యని చెప్పవచ్చును. కాని మార్గ, దేశి కవిత్వాల నిర్ణయం కేవలం భాషాభేదాల నాశ్రయించింది కాదు. ఇతివృత్తము, భావము, ఛందస్సు, మొదలగువానిని కూడా పరిశీలించవలసి ఉంది. గురువర్యులు ఆచార్య జి. నాగయ్యగారు తమ దాక్షిణాత్య సాహిత్య సమీక్షలో దేశి కవితను ఇలా వివరించారు.

"ప్రత్యక్ష సంస్కృత ప్రభావమును ప్రతిబింబింపజేయక, కథావస్తువు, వర్ణనలు, భావము, భాష, రీతులు, అలంకారములు, కవిసమయములు, ఛందస్సు, సాహిత్యప్రక్రియలు, మొదలగు వానియందు, దేశిలక్షణములను ప్రధానముగా నారోపించుకొని దేశీయ ప్రజాజీవితమునకు సన్నిహితముగ జన సామాన్యమున వ్యాప్తికొరకు ఉద్దేశింపబడిన ప్రజాకవిత దేశికవిత"[3] ఈ నిర్వచనం దేశికవితను సాహిత్యపరంగా నిరూపించడానికి సరిపోతుంది.

## దేశి కవిత వర్గీకరణ

దేశి కవిత్వం, నిబద్ధదేశి, అనిబద్ధదేశి అని రెండురకాలు. ఏ భాషా సాహిత్యమందైనా తొలుత దేశి కవిత్వం, ఆ తర్వాత మార్గ కవిత్వం వ్యాప్తికి రావడం సహజం. "దేశీయమైన శుద్ధదేశికవితకు, సాంస్కృతికమైన ప్రౌఢ సాహిత్యమునకు సామరస్యం కల్గించి ఉభయ తారకముగ వాఙ్మయ పథమున వెలసినది"[2] నిబద్ధదేశి. ఇది పద్యకవితతో సమానమైన సారస్వత గౌరవాన్ని పొందినట్టిది. తాళ్ళపాక అన్నమాచార్యులు, క్షేత్రయ్య, ఏగంటి, సారంగపాణి మొదలైన వారి పదములు, కీర్తనలు, ఏలలు, జోలలు, సువ్వాలులు మొదలైనవి ఈ కోవకు చెందినవి. ద్విపద కావ్యములు, శతకములు, ఉదాహరణములు, దండకములు, యక్షగానములు, హరికథలు ఇత్యాదులు నిబద్ధదేశికి చెందిన

ప్రక్రియలు. దేశీయ ఛందముతో, దేశీయ సంప్రదాయానుసారంగ, రచింపబడి, సామాన్యజనుల ఆదరాభిమానములతో వ్యాప్తి నొందిన ప్రజా కవిత్వము అని బద్ధదేశి.

అనిబద్ధదేశిని రెండు రకాలుగా విడగొట్ట వచ్చు. ఒకటి జాతిదేశి రెండు పామరదేశి. అగ్రవర్ణములకు చెందిన జానపదులు, స్త్రీలు, బాలబాలికలు, పాడుకునే గేయాలు 'జాతిదేశి'గా చెప్పవచ్చు. చదువు సంధ్యలు లేని పామరులు పాడుకునే వల్లెపాటలు, వీరగాథలు ఇత్యాదులు పామర దేశిగా చెప్పవచ్చు.

మార్గ, దేశి కవితా పద్ధతులలో ఒండొంటి సంపర్కము ఉండరాదనుటకు వీలు లేదు. మార్గకవిత్వమందు దేశి కవితాచాయలు, దేశి కవిత్వమందు మార్గ ఛాయలు కవితా చాయలు కన్పించవచ్చు. అట్టి సందర్భాలలో బాహుళ్యాన్ని బట్టి మార్గ - దేశి కవితా భేదాలను నిర్ణయించాలి.

## కన్నడ సాహిత్యంలో దేశి రచనలు

కన్నడ సాహిత్యం తొమ్మిదో శతాబ్దంలో ఆరంభమైంది. నృపతుంగుడు (క్రీ.శ. 814 - 877) వ్రాసిన 'కవిరాజ మార్గము' మొదటి గ్రంథం. అంతకు ముందే జానపద కవిత వెల్లివిరిసింది. శాసనాలున్నాయి. కవిరాజ మార్గరచనకు ముందే దేశి కవిత్వం కన్నడ దేశంలో వ్యాప్తిలో ఉండేదని ఈ గ్రంథంలోని దేశి కవితా ప్రస్తావన వల్ల తెలుస్తున్నది. కవిరాజ మార్గ పీఠికలో 'బెదండె,' 'చత్తాణం,' అనే రెండు కావ్యభేదాలు చెప్పబడ్డాయి. ఇవి దేశీయ ఛందంలో వ్రాసిన కావ్యభేదాలని "హళగన్నడంలో" (ప్రాత కన్నడం) వ్రాయబడ్డాయని పరిశోధకుల అభిప్రాయం. 'చత్తాణం' అన్నది జక్కులతాణమని, యక్షగానమే 'చత్తాణ' మనే అభిప్రాయాన్ని కొందరు వెలిబుచ్చారు. 'బెదండె' అన్నది వాద్య విశేషాన్ని సూచిస్తుంది. ఈ వాద్య విశేషంతో పాడేదే 'బెదండె' కావ్యం కావచ్చు. ఇది ఉదాహరణ కావ్యాన్ని పోలి యుంటుందని కొందరి ఊహ. ఈ రెండు కావ్యాలు అలభ్యాలు. నాగవర్మ కన్నడ ఛందోంబుధిలో 'మెల్ నాడు,' 'బాజనెగబ్బ 'పాడుగబ్బ' అను దేశి రచనలను పేర్కొన్నాడు. కాబట్టి కన్నడంలో దేశి కవిత కవిరాజ మార్గమునకు ముందే ఉన్నట్లు ఊహించ వచ్చు పంపకవి విక్రమార్జున విజయము నందును, రన్న కవి గదా యుద్ధము

నందును, మల్లికార్జునుని సూక్తిసుధార్ణవమునందును మార్గదేశి కవిత్వ ప్రస్తావన ఉంది.

కన్నడ సాహిత్య చరిత్రలో బసవనయుగం (క్రీ. శ. 12 శ. నుండి 14 వ శతాబ్ది వరకు) స్వతంత్ర యుగంగా చెప్పుకోవచ్చు. బసవేశ్వరుని అవతరణతో (క్రీ. శ. 1160) మార్గకవితా పద్ధతిపై ఒక విప్లవం చెలరేగింది. విషయంలో, భాషలో, ఛందస్సులో దేశి ప్రాధాన్యము అధికం కాజొచ్చింది. జైన, బౌద్ధమతాలకు పోటీగా వీరశైవ మతాన్ని జన సామాన్యంలో వ్యాప్తి చేయడానికి దేశీ ఛందస్సులో రచనలు సాగించారు. కన్నడ శివ కవులలో మూలవిరాట్టు లాంటివాడు బసవన్న. ఇతని పేరు, భావాలు దక్షిణ దేశం లోని ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపించాయి. వీరశైవం కన్నడ దేశంలో విజృంభించింది. 'వచన' మనే పేరుతో నూత్న సాహిత్యప్రక్రియ ఉదయిం చింది. 'వచన' మంటే గద్యమని అర్థం కాదు. అటు గద్యమూ కాని, పద్యమూ కాని భావగీతాలు వచనాలు ఆత్మభక్తి నివేదన కోసం, సామాజిక అన్యా యాల ఖండన కోసం శివకవులు సాధనంగా ఉపయోగించుకున్న నూత్న సాహిత్యప్రక్రియ"[3] ప్రతి వచనం చివర ఆ యా వచనకారుల ఇష్టదైవముల పేర్లు మకుటంగా కనిపిస్తాయి. బసవేశ్వరుడు రచించిన వచనముల చివర "కూడలి సంగనుదేవా" అనే మకుటముంది. అల్లమ ప్రభుదేవర వచనముల లోని మకుటం "గుహేశ్వరా" అనునది. "చెన్న మల్లికార్జునా" అనునది అక్క మహాదేవి వచనములకు మకుటం. భావకవుల, అభ్యుదయ కవితల అపూర్వ సమ్మేళనంగల వచన పద్యాలు శివకవుల వచనాలు. ఈ కాలంలో బ్రాహ్మ ణేతరులు కూడా కావ్యరచన చేశారు. వీరశైవ కవులు ధార్మిక విషయాలేగాక, సామాజికమైన మార్పులకోసం, శ్రమించారు. వీరశైవ మంతయు వచనములు, షట్పదులు, రగడలు మొ॥ దేశీయ ప్రక్రియలలో సాగింది. కన్నడ సాహి త్యంలో 200 మందికి పైగా వచనకారులున్నారు. బసవన్న షట్‌స్థలవచ నము, కాలజ్ఞాన వచనము ప్రసిద్ధమైనవి. ఈ కాలంలో దేవర దాసిమయ్య. (1015-1044), అల్లమ ప్రభు, అక్క మహాదేవి, సిద్ధరాయ, చెన్న బస వణ్ణ, మొదలగువారు ప్రసిద్ధ వచన కర్తలు.

బసవ యుగంలో, ప్రసిద్ధిగాంచిన కవి హరిహరుడు. 'రగళె' (తెలు గులో రగడ) అన్న దేశి ఛందస్సుకు ఈ కవి ప్రాణ ప్రతిష్ఠ చేశాడు. అంష

ఈ కవికి 'రగళెయ కవి' అని కూడా పేరుంది. హరిహరుని రగళె కావ్యాలలో 'బసవరాజ దేవర రగళె' అత్యంత శ్రేష్ఠమైనది. పాల్కురికి సోమనాథకవి కన్నడంలో 'సద్గురు రగళె', 'శరణ బసవరగళె' అనురగడ కృతులను రచించాడు. అండయ్య అను కవి (క్రి. శ. 1235) ఒక్క తత్సమ శబ్దం కూడా వాడకుండ అచ్చగన్నడమునందు 'కబ్బిగర కావ' అనుకావ్యాన్ని రచించాడు. భీమకవి (క్రి. శ. 1369) బసవ పురాణాన్ని భామినీ షట్పదిలో రచించాడు. దీనికి మాతృక తెలుగు బసవ పురాణము.

కుమార వ్యాసయుగంనుండి, ఆధునిక యుగం వరకు పెక్కు దేశీయ రచనలు కన్నడంలో వెలిశాయి. దాసకూట ఉద్యమ ఫలితంగా దేశి సార స్వతం విస్తారంగా వెలిసింది. కుమార వ్యాసయుగంలో భాష హొసగన్నడం (క్రొత్త కన్నడం) వైపుకు వికాసం చెందడం ప్రారంభమైంది. వైష్ణవ మత గ్రంథాలు చాలావరకు దేశీయ ఛందములలో వ్రాయబడినవి. శివకవుల నను సరించి జనసామాన్యానికి అందుబాటులోకి తేవడానికి ప్రయత్నించినారు. దేశీయ సాహిత్యానికి, సంగీతాన్ని కూడా జోడించారు. కుమార వ్యాస భార తము, కుమారవర్మ రామాయణము, విట్ఠల నాథుని భాగవత పురాణము షట్పదీ ఛందములో రచింపబడ్డాయి.

విజయనగరంరాజుల కాలంలో కన్నడ సాహిత్యంలో మైలు రాయిగా పేర్కొనదగినది దాస సాహిత్యం. ఇవి రగడ ఛందములో రచింపబడిన భక్తి గీతాలు. ఈ దాస వాఙ్మయం కూడా 'వచనముల' వలె ప్రజలలో నవ చైతన్యం కల్గించింది. 16 వ శతాబ్ది ప్రారంభంలోని శ్రీపాద రాయలు దాస సాహిత్యానికి మూల పురుషుడు శ్రీపాద రాయలు కీర్తనలను వ్రాయడమేగాక పాడి, పాడించి ప్రాచుర్యం కలిగించాడు. కొన్ని కీర్తనలను నృత్యయోగ్యంగా రచించాడు. ఇతని శిష్య ప్రశిష్యులు దాస సాహిత్యాన్ని వృద్ధి గావించినారు. కన్నడంలో హరిదాస సాహిత్యం ఒకటి ప్రత్యేకంగా ఏర్పడింది.

శ్రీపాదరాయల శిష్యుడైన వ్యాసరాయలు 'కృష్ణ' శ్రీకృష్ణ 'సిరికృష్ణ' అనే అంకిత నామాలతో వందలకొలది మనోహరమైన కీర్తనల్ని రచించి దాస కూటాన్ని ఉన్నత స్థితికి తెచ్చినాడు. వ్యాసరాయల ప్రియశిష్యులలో పురందర దాసు (క్రి. శ. (1480-1564) వాగ్గేయ చక్రవర్తి అన్నమా చార్యుల సమకాలీనుడు దాస సాహిత్యాన్ని అత్యున్నత స్థాయికి తీసుకొని

వెళ్ళాడు "పురందర విఠల" అన్నది పురందరదాసు కీర్తనలలో మకుటం. దైవభక్తి, నీతి, నిష్ఠ, ధర్మం అభివృద్ధి కావాలని ఈతని ఆకాంక్ష. వ్యాస రాయల శిష్యులలో ఉత్తమ పదకర్త కనకదాసు. ఇతని గ్రంథాలలో 'మోహన తరంగిణి' సుమారు 7200 సాంగత్యాలున్న రచన. సాంగత్యము మాత్రాఛందస్సులోనిది. సాధారణంగా స్త్రీల పాటలన్నీ ఈ ఛందస్సులోనే యున్నాయి. కనకదాసే గాక గోపాలదాసు, విజయదాసు, జగన్నాథదాసులు పద రచనచేసి కన్నడ గాన సాహిత్యానికి ఎంతో పుష్టిని, తుష్టిని చేకూర్చినారు. కుమార వ్యాసయుగంలోనే సర్వజ్ఞుడను కవి (16వ శతాబ్ది) సర్వజ్ఞ వచనాల పేరుతో త్రిపది ఛందస్సులో రెండువేల పద్యాలు వ్రాసినట్లు ప్రతీతి. 'త్రిపది', కన్నడ జానపద సాహిత్యానికి గాయత్రి వంటిది. సర్వజ్ఞుని వచనాలు వేమన పద్యాలవలె ముక్తకాలు. నీతి, భక్తి, మతం, సామాజికవిమర్శ, ఆత్మ విమర్శ, మూఢాచారాల ఖండనతో కూడినట్టివి.

కన్నడంలో దేశిదృశ్య రూపాలైన యక్షగానాలు, బయలాటలు ప్రాచీనకాలంనుంచే ఉన్నాయి. తెలుగు యక్షగానాల ప్రభావంచే కన్నడంలో దేశిదృశ్య కవితా పద్ధతి పెంపొందింది. 'కృష్ణ సంధానము', 'సైంధవ వధ', గిరిజా కల్యాణం, బభ్రువాహన కళగ, ఘటోత్కచ, పారిజాతము, మైరావణ కళ, 'ప్రహ్లాద చరితె' మొదలైనవి కన్నడ యక్షగానములు. వీటిలో కన్నడ దేశీయ ఛందస్సులగు ద్విపద, చౌపది, సాంగత్యము, షట్పది (భామినీ షట్పది) మొదలగునవి వాడబడినవి.

ఆధునిక యుగంలో కూడా దేశి సాహిత్యానికి ఆదరణ పెరిగింది. గేయ కవిత్వము మొ॥ ప్రక్రియలతో వెలసింది. ఆంగ్ల సాహిత్య ప్రభావంచే కూడా దేశి కవిత చాలావరకు పెంపొందిందనవచ్చు. ఈ విధంగా ప్రాచీన కాలంనుండి కన్నడ సాహిత్యంలో దేశి రచనలు వ్యాప్తియందున్నాయి.

## తెలుగు సాహిత్యంలో దేశి రచనలు

క్రీ. శ. 11 వ శతాబ్దిలో తెలుగు సాహిత్యం వెలసింది. అంతకు పూర్వం గ్రంథ రూపంలో లభ్యంకాకున్నా పద, గేయ రూపమైన దేశి కవిత ప్రజల నోళ్ళలో ఉనుకుండేదని పరిశోధకుల నిర్ణయం. క్రీ. శ. 1వ శతాబ్దికి

చెందిన హాలుని గాథా సప్తశతిలో సహజ దేశీయమైన పాటల ప్రసక్తి కొన్ని చోట్ల కన్పిస్తుంది. "చక్కగా దంచిన సన్నబియ్యపు వంటి వెన్నెల, తాను కోరుకొనిన దానికంటె కొల్లగా పండిన పైరును ఒక పల్లెరైతు చూచి ఆనంద ముతో ఇచ్చపచ్చినట్లు పాడుకొనెన"ని గాథా సప్తశతి 789 గాథలో ఉంది. ఇలాటి దేశీయమైన పాటలు మరికొన్ని చూడవచ్చు. దేశీయ ఛందోరీతులైన తరువోజ, సీసము, మధ్యాక్కర ప్రాచీన శాసనాలలో కన్పట్టుచున్నవి. నన్నెచోడ కవిరాజు (12వ శతాబ్ది) దేశాభిమానంగల కవిరాజు. 'కుమార సంభవము'న దేశియ చారాలను, కవి సమయాలను చొప్పించినాడు. దేశి మార్గాలను దేశీయములుగా చేయాలని ఆతని తలంపు.

క్రీ. శ. 12వ శతాబ్దంలో శివకవులు దేశి కవితకు సంస్కృత భాషతో సమానమైన కావ్య గౌరవాన్ని కల్గించారు. దేశి కవితాశాఖ లన్నింటిలో గుణములోను, ప్రయోజనంలోను, పరిమాణంలోను అగ్రగణ్యమైంది ద్విపద కవితా శాఖ. పాల్కురికి సోమనాథుడు (క్రీ. శ. 1160-1240) సంస్కృ తాంధ్ర కన్నడ భాషలు మూడింటిలో గ్రంథ రచనలు చేశాడు. తెలుగు కృతులలో బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, సోమనాథ స్తవము, అనుభవసారము, చెన్నమల్లు సీసములు, వృషాధిపశతకము, బసవోదాహరణ ఇత్యాదులు. ఇవన్నియు దేశి రచనలు. కన్నడంలో బసవ రగళె, సద్గురు రగళె, చెన్న బసవస్తోత్రద రగళె అను గ్రంథాలను రచించి నాడు. దేశీయ వర్ణనలు తన రచనలో చొప్పించాడు. శైవమతం ప్రచారం కోసం పాల్కురికి రచనలలో వస్తువు, భాష, భావము, వర్ణనలు, ఛందస్సు అంతా దేశియములై ఆంధ్రుల సాంఘిక చరిత్ర, సంస్కృతి తెలుసుకో డానికి కూడా ఉపకరిస్తాయి.

తెలుగులో మొదట వెలసిన రంగనాథ రామాయణము ద్విపద కావ్యము. దీని కర్త గోనబుద్ధారెడ్డి (క్రీ. శ. 1200-1250). వాల్మీకి రామా యణము ననుసరించినా, అవాల్మీకాంశాలు పెక్కు కన్పిస్తాయి. ఆనాడు జాన పదులలో వ్యాప్తిలోనున్న గాథలను గ్రహించినట్లు ఊహించవచ్చు. ఈ రంగ నాథ రామాయణ ద్విపద పంక్తులు కొన్ని తోలుబొమ్మలాటలందు కూడా గానం చేసేవారట. కన్నడంలో వ్యాప్తియందున్న వచన ప్రక్రియ తెలుగులో

కూడా చోటు చేసుకున్నది. కృష్ణమాచార్యులు (క్రీ. శ. 1295-1328) తెలుగు సాహిత్యంలో ప్రప్రథమ వచన కావ్యకర్త. అతని 'సింహగిరి వచనములు' చూర్ణికలనెడి వచన భేదంగా తాళ్ళపాక చిన్నన్న వివరించినాడు. ఇవి ముక్తకములు. కృష్ణమాచార్యుల వచనముల ననుసరించి తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు వేంకటేశ్వర వచనములను రచించినాడు. వచన ప్రక్రియ శైవేతర కవులను కూడా ఆకర్షించింది. శంకరవచనములు, ఏగంటివారి వచనములు, చిట్టన్నగారి వచనములు, చిలుకపాటి వారి వచనములు తెలుగులో శైవ కవులు రచించిన వచనములు. ఇవి భక్తి వేదాంత విషయాలతో నిండి యున్నట్టివి.

మార్గకవులు కూడా కొన్ని దేశిరచనలు చేసినట్లు గ్రహింపవచ్చు. శ్రీనాథుని పల్నాటివీరచరిత్ర, పోతనకవి భోగినీదండకం, గౌరనకవి హరిశ్చంద్రోపాఖ్యానం, నవనాథచరిత్ర ఇత్యాది ద్విపదదేశిరచనలు తెలుగు సాహిత్యమందున్నాయి.

తెలుగులో సంకీర్తనములనబడే భక్తిగేయాలు దేశిశాఖకు చెందినట్టివే. వైష్ణవమత ప్రాధాన్యంతో వెలువడిన ఈ కీర్తనలకు తాళ్ళపాక అన్నమాచార్యుడు (క్రీ. శ. 1408-1503) ఆద్యుడు. పదకవితా పితామహుడు. అన్నమయ్య 32వేల కీర్తనలు రచించినట్లు ప్రతీతి. అవి భక్తి, వేదాంత, శృంగార కీర్తనలు. దేశిరచనకు అన్నమయ్య చేసిన సేవ అపారము. అన్నమయ్య సంకీర్తనలలో జోలపాటలు, ఉయ్యాలపాటలు, మేలుకొలుపు పాటలు, తుమ్మెదపాటలు, మంగళహారతులు మొదలగు దేశీయములైన పద రచనలెన్నియో కన్పట్టును.

అన్నమాచార్యుల పెద్దభార్యయైన తాళ్ళపాక తిమ్మక్క సుభద్రా కళ్యాణమను మంజరీద్విపద రచించింది. ఇందు తెలుగు ఆడపడుచుల కిష్టమైన బొమ్మలపెండ్లిండ్ల గురించిన వివరాలు కూడా తెల్పబడినవి. అన్నమాచార్యుల కుమారుడగు పెదతిరుమలాచార్యుడు వేంకటేశ్వర వచనములతోపాటు వేంకటేశోదాహరణము, చక్రవాకమంజరి, శృంగారదండకము, శృంగార కీర్తనలు రచించినాడు. అన్నమాచార్యుని పౌత్రుడైన తాళ్ళపాక చిన్నన్న

ద్విపదకు పేరుపొందినవాడు. ద్విపద పరమయోగివిలాసము, అష్టమహిషీ కళ్యాణము, ఉషాకళ్యాణము, అన్నమాచార్యచరిత్ర అనునవి చిన్నన్న ద్విపద గ్రంథాలు. ఇట్లు తాళ్ళపాక కవులందరు చదువుల సరస్వతులై దేశికవిత్వాన్ని వివిధ ప్రక్రియలలో వెలయించినారు అన్నమయ్యతోను, తద్వంశీయులతోను ప్రారంభమైన పదకవిత క్షేత్రయ్య కాలమునాటికి బాగా పరిణతమై, పరిపూర్ణ స్థితికి వచ్చింది. ఇతని మువ్వగోపాల పదములు శృంగార (మధురభక్తి) పదములుగా ప్రసిద్ధి కెక్కినవి. త్యాగరాజ కృతులందు సాహిత్యం కంటె సంగీతం ప్రాధాన్యం వహించింది. సారంగపాణి పదాలు, కీర్తనలు రచించాడు. రామదాసుకీర్తనలు బహుళప్రచారం పొందినవి. అట్లే పోతులూరి వీరబ్రహ్మం, దూదేకుల సిద్ధయ్య మొ॥ వారి తత్త్వాలు కోకొల్లలు దేశిరచనలు కనిపిస్తాయి. కూచిమంచి తిమ్మకవి (క్రీ. శ. 1700-1750) అందించిన అచ్చతెనుగు రామాయణము కూడా విశిష్టమైంది.

ఆంధ్రతాముద్రను తీర్చిదిద్దిన దేశి దృశ్యరూపం యక్షగానం కందుకూరు రుద్రకవి (క్రీ. శ. 1508) సుగ్రీవవిజయమను యక్షగానము తెలుగు యక్షగానములలో మొట్టమొదటిది. ఇందు ద్విపదలు, దరువులు, ఏలలు మొదలైన దేశిరచన లెన్నియో కలవు. తంజావూరు నాయకరాజుల కాలంలో యక్షగాన ప్రక్రియకు రాజాదరణ కూడా లభించింది. కొరవంజులు, వీధినాటకములు మొ॥నవి యక్షగాన ప్రాయములగు రచనలే. తెలుగున ప్రాచుర్యం పొందిన యక్షగానం కన్నడంలోనికి కూడా వ్యాపించింది.

ప్రజాకవిగా ప్రసిద్ధిపొందిన వేమన తన కాలమునగల మూఢ నమ్మకాలను అధిక్షేపించడానికి దేశీయమగు ఆటవెలది పద్యాన్ని ఉపయోగించుకున్నాడు. ప్రజలలో అచ్చమైన తెలుగుదనము ముట్టిపడునట్లు పద్యరచన సాగించుట వేమన ప్రత్యేకత.

కన్నడములో వలె తెలుగులో కూడా ఆధునికయుగంలో మార్గకవితా పద్ధతి సన్నగిల్లి దేశి సాహిత్యానికి ఆదరణ హెచ్చింది. గురజాడ అప్పారావు దేశభక్తిగీతములు, గరిమెళ్ళ సత్యనారాయణగారి "మాకొద్దీ తెల్లదొరతనము" వంటి గేయాలు ఆధునిక కవితకు నాందీవాక్యము పలికినట్లయింది.

ఆధునికంగా కన్నడాంధ్రములందు దేశి వాఙ్మయ శాఖయైన గేయకవిత్వము, వివిధ ప్రక్రియలలో వెలుగొందుచు దేశికవితకు చైతన్యం కల్గించుచున్నది.

కన్నడాంధ్ర సాహిత్యమందు ప్రాచీనకాలం నుండి ఆధునికయుగం వరకు అవిచ్ఛిన్నంగా దేశిరచనలు కొనసాగుచున్నవి.

తులనాత్మకంగా పరిశీలించినపుడు కన్నడంలో బసవన్న, తెలుగులో పాల్కురికి సోమనాథ కవులు దేశిరచనలకు, వ్యాప్తికి బహుళ కృషి చేసినట్లు గమనించవచ్చు. కన్నడ, తెలుగు దేశిరచనలందు భేదాలకంటే సామ్యాలే ఎక్కువ కనిపిస్తాయి. అందుకు కారణం ఈ భాషా సాహిత్యాలు ద్రావిడ భాషాకుటుంబానికి చెందినవి కావడమేనని చెప్పవచ్చు. ఇక ఛందోరీతులను పరిశీలిద్దాం.

## కన్నడాంధ్ర దేశి ఛందోరీతులు

కన్నడాంధ్ర భాషా దేశి సాహిత్యాలలో అక్కర, చౌపది, రగడ, ఉత్సాహ, షట్పది, తరువోజ మొదలగు దేశీయ పద్యాలన్నింటిలో సహజంగా సామ్యం కన్పిస్తుంది. కన్నడాంధ్ర లక్షణకర్తలు పై దేశీయ పద్యాలకు జాతులని పేరు పెట్టినారు. కన్నడంలో "గీతికె" అనుదానికి కూడా ఈ ప్రాస నియమ ముండుటచే అది కూడా జాతులలో చేరుతుంది. తెలుగునందు 'గీతము' నకు ప్రాసనియమం లేదుగాని 'వడి' నియమం ఉంది. కన్నడంలో తేటగీతి కనిపించదు. తెలుగులో కనిపిస్తుంది.

తెలుగున సీసమనునది ప్రాసనియమంలేని మరొక దేశీయ పద్యభేదం. తెలుగు లాక్షణికులు ఈ గీతమును, సీసమును చేర్చి ఉపజాతులను నొక తెగను కల్పించారు. కన్నడంలో సీసపద్యం లేదు. కన్నడంలో గాని, సంస్కృతంలోగాని లేని 'వడి' నియమం తెలుగు పద్యరచనలో కన్పిస్తుంది. ఈ 'వడి', 'ప్రాస' రెండూ సంస్కృత, ప్రాకృత కవితా సాంప్రదాయాలు గావు. కేవలం దేశీయమైనవి.

కన్నడం ననుసరించి తెలుగులోకి 'రగడ' ప్రక్రియ వచ్చింది. 'రఘట' అని కన్నడంలో దానికి పేరు. గణ నియమ విపర్యాసముండినను, సమాన

మాత్రా సంఖ్యగలిగి తాళబద్ధమై యుండునది 'రఘటా' బంధమగునని ఛందోంబుధిలో (3-222) రగడకు లక్షణాలు చెప్పబడినవి. షట్పది కన్నడజాతి పద్యం. తెలుగు లాక్షణికులు దీనిని కన్నడము నుండే గ్రహించారు. షట్పది అను పేరును బట్టియే ఇందులో ఆరుపాదములుంటాయని తెలుస్తుంది. తెలుగున షట్పదికి గేయ సాహిత్యంలో తప్ప పూర్వసాహిత్యంలో ప్రచారం కనిపించదు. తెలుగు షట్పదికి ఉదాహరణ సువ్విపాట.

"సువ్వి సువ్వి రామచంద్ర
సువ్వి సువ్వి కీర్తి సాంద్ర
సువ్వి - నీ - తమ్మ మాకు, శుభము - లి - మ్మా" (షట్పదీ

రూపకం) తెలుగులోని 'గుమ్మ దేడి గోపీదేవి' "శ్రీ శంభు తనయునకు సిద్ధిగణ నాధునికి" మొదలైనవి షట్పదులే.

'త్రిపది' కన్నడజాతి పద్యాలలో ఒకటి. సర్వజ్ఞుని వచనములు త్రిపది ఛందస్సులో రచింపబడింది. 'సాంగత్యము' మాత్రా ఛందస్సులోనిది. సాంగత్యమను పద్యాలకు కన్నడంలో బహుళ ప్రచారం ఉంది. కన్నడంలో దేశి ఛందస్సు 'మందానిలయము' నాలుగు మాత్రల గణములతో కూడిన దగుటచే మధురగతిరగడకు సరిపోతుంది.

కన్నడాంధ్ర భాషల్లోని పాటలు దేశీయ గణాలతో కూడి ఉంటాయి. చాలా పాటల్లో గణ విభజన కష్టమైనా వాటి నడకను బట్టి, లయను బట్టి, రాగచ్ఛాయను బట్టి పోలికల్ని గుర్తించవచ్చు. దేశి ఛందోరీతులైన ద్విపదలు, రగడలు, షట్పదులు జానపద గేయాలలో అసంఖ్యాకంగా కనిపిస్తాయి. లయనుబట్టి చూస్తే జానపదగేయాలు తెలుగు కన్నడంలో సమానమనిపిస్తాయి. కన్నడాంధ్రముల రెండింటిలో జానపద సాహిత్యం ఛందో నియమం లేకుండా మూడు, నాలుగు ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది ఆవృత్తాలలో నడుస్తుందని చెప్పవచ్చు.

ఈ విధంగా దాక్షిణాత్య సాహిత్యాలైన కన్నడాంధ్రములలో దేశి రచనలందు, ఛందోరీతులందు సామ్యంకలిగియుండదని తులనాత్మక పరిశీలన వల్ల తేలినది

## ప్రయుక్త గ్రంథాలు

1) దాక్షిణాత్య సాహిత్య సమీక్ష, మొదటి సంపుటం
ఆచార్య జి. నాగయ్య
నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి (1976)

2) కన్నడ సాహిత్య చరిత్ర, డా॥ ఆర్వియస్ సుందరం
ఆం. ప్ర. సాహిత్య అకాడమి, హైదరాబాదు (1977)

3) తెలుగు సాహిత్య సమీక్ష, డా॥ జి. నాగయ్య
మొదటి సంపుటం
నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి.

4) తెలుగు, తమిళ, కన్నడ పద కవిత్వములు (వ్యాసం)
డా॥ ఎస్ గంగప్ప
తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక, హైదరాబాదు.

# వంగ నవలాసాహిత్యం జాతీయోద్యమం

భారత దేశంలో జాతీయతా భావం క్రీ.శ. 1857 నుండే ప్రగాఢంగా నాటుకుంది. రాజకీయంగా జాతిని పటిష్టం చేయడానికి బాలగంగాధర తిలక్, 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు- దాన్ని సాధించి తీరుతాను' - అని నినదించి నాడు. తత్ప్రభావం చేత ప్రజల్లో స్వాతంత్ర్యాభిలాష పొడచూపింది. గాంధీ మహాత్ముడు 1920 ప్రాంతంలో జాతీయోద్యమ రంగం మీద అవతరించి అనేక రాజకీయ ఉద్యమాలతో బ్రిటిషు వారిని కంపింప చేసినాడు. దిగజారిన మానవీయ విలువల్ని ఉద్ధరించడానికి మానవతా వాదాన్ని ప్రతిష్ఠించినాడు. జాతీయ జీవనంలో జరిగే మార్పు సాహిత్యాన్ని కుడా ప్రభావితం చేస్తుంది. ఆనాటి జాతీయోద్యమ ప్రభావం భారతీయ సాహిత్యా లన్నింటిని ప్రభావితం చేసింది. సమాజం యొక్క ప్రభావం సాహిత్యం పై ఉండడం సహజమే గదా!

జాతీయోద్యమ ప్రభావంతో ఆధునికంగా ఆంగ్లం నుండి ఆవిర్భవించిన సాహిత్య ప్రక్రియ నవల. సజీవమైన జగత్తుతో పరిచయం చేసే కళాకృతి నవల. జీవితానికి ప్రతిబింబం నవల. వేదన, భావుకత ఈ రెండూ నవలకు ప్రేరణ శక్తులు. వంగ, తెలుగు సాహిత్యాలలో నవలా స్వరూప స్వభావాలను, జాతీయోద్యమం నవలపై చూపిన ప్రభావాన్ని విశ్లేషించడం ఈ వ్యాసోద్దేశం.

ఏ కొత్త ప్రక్రియనైనా మరొకదేశం నుండి గ్రహించినపుడు అను వాదాలు, అనుకరణలు తప్పవు. బెంగాలీ సాహిత్యంలో కూడా మొట్ట మొదట

ఆంగ్ల సాహిత్యానికి అనువాదాలు, అనుకరణలు వెలువడ్డాయి. బంకిం చంద్ర చటర్జీ (క్రీ.శ. 1838 - 1894) వంగ నవలా సాహిత్యానికి మూల పురుషుడు. ఇతడు వచన శైలిని సంస్కరించి తన ప్రతిభని నవలవైపు మళ్ళించాడు.

బంకిం చంద్ర చటర్జీ క్రీ.శ. 1864 లో ఆంగ్లంలో 'Raja Mohan's Wife' అనే ఒక నవల రాశాడు. అది 'Indian field' పత్రికలో వరుసగా ప్రకటింపబడింది. అంతకు ముందే భూదేవవసుగారి 'అంగురీయ వినిమయ' అనే నవలిక వెలువడిందని ప్రతీతి. కాని క్రీ.శ. 1865 లో బంకిం చంద్రుని 'దుర్గేశనందిని' నవలతోనే వంగ సాహిత్యంలో నవలకు అరుణోదయ మయింది. ఇది స్కాట్ (Scott) రాసిన ఐవాన్ హో (Ivan hoe) ననుస రించిన నవల, చక్కని శైలితో సాగిన ప్రేమ కథ ఇది. బంకిం చంద్రుడు రాసిన నవలలు పద్నాలుగు. అవి దుర్గేశనందిని, కపాలకుండల, మృణాళిని, విషవృక్ష, ఇందిర, యుగళాంగులీయ, చంద్రశేఖర, రజని కృష్ణకాంతేర ఉయిల్, రాధారాణి, రాజసింహ, ఆనందమఠ్, దేవీ చౌధురాణి, సీతారామ అనేవి. ఇందు కొన్ని అనురాగాత్మకమైనవి. మరికొన్ని దేశభక్త్యాత్మక మైనవి.

దేశ భక్త్యాత్మకమైన వాటిలో పేరొందింది 'ఆనందమఠ' నవల. ఇది 1882 లో వెలువడింది. సుప్రసిద్ధ రాజకీయ నవల యిది. ఇందు పాత్రల్ని స్వార్థం లేని దేశభక్తులుగా, భగవద్గీత ననుసరించి జీవించే నిష్కామ యోగులుగా, తమకంటే ఎన్నోరెట్లు బలమున్న బ్రిటిషు సేనల్ని ముందు వెనుకలు చూడకుండ ఎదుర్కొనే సాహసవీరులుగా చిత్రించినారు. ఈ నవల ప్రబోధాత్మకమైంది. ఆనాటి ప్రజలను జాతీయోద్యమం వైపు మళ్ళించ గలిగింది. సాయుధ విప్లవానికి కూడా ఈ నవల ప్రోత్సాహాన్నిచ్చింది. ఇంతటి ప్రాశస్త్యం గల నవల గనుకనే ఇతర భాషల్లోకి అనువాదాలు, అనుకరణలు అనేకం జరిగాయి.

బకించంద్ర చటర్జీ ప్రతినవలలోను, అతని ప్రతిభ ఉజ్జ్వలంగా కనిపిస్తుంది. పాఠకుల్ని చకితుల్ని చేస్తుంది. వీరి దేశభక్తి ప్రబోధాత్మక నవ లల్లో 'ఆనందమఠ,' తర్వాత 'దేవీ చౌధురాణి, సీతారామ, కపాలకుండల,

చెప్పుకోదగ్గవి. పరాధీన భారతభూమి పరిరక్షణను ఎలా దీక్షవూనాలో పరోక్షంగా ఈ నవలల్లో ఉద్బోధించాడు. జాతీయోద్యమం వైపు నడిపించాడు.

బంకించంద్ర తర్వాత రమేశ చంద్ర దత్తు 'మహారాష్ట్ర జీవన ప్రభాత' (1870), 'వంగ విజేత' (1874) 'మాధవీకంకణ' (1877) అనే చారిత్రక నవలలు వ్రాశారు. వీటిలో దేశభక్తి వెల్లువలై పారింది. 'వంగ విజేత' లోనూ, 'మాధవీకంకణం' లోనూ వీరరసం వరవళ్ళు తొక్కింది. వీరి కాలంలోనే 'ప్రతాపసింహ' 'ఝూన్సీరాణి' వంటి నవలలు పైకి వచ్చాయి.

వంగ భాషలో సుప్రసిద్ధ రచయిత్రి స్వర్ణకుమారీదేవి (1857-1937) విశ్వకవి రవీంద్రుని అక్క. ఈమె తొలి నవల 'దీప నిర్వాణ' (1878). ఇందు రాణీ సంయుక్త చరిత్ర వివరింపబడింది. దేశ భక్తి ప్రబోధాత్మకమైన నవల యిది.

జాతీయోద్యమ ప్రభావంచే ప్రభావితులై వంగకవులైన బంకించంద్ర చటర్జీ, విశ్వకవి రవీంద్రుడు సూర్యచంద్రుల్లా వెలుగొందినారు. రవీంద్రుని నవలల ప్రభావం జాతీయోద్యమంపై కూడా పొటమరించింది. రవీంద్రుడు 19 వ శతాబ్దం చివర నవలారచనకు పూనుకొని పండ్రెండు నవలలు రాశారు. అందు ఆయన మొదటి నవల 'చౌతాకురాణీ రహాట' (1883) రెండోది 'రాజర్షి' (1885). ఇందలి కథ త్రిపురవంశ రాజచరిత్ర. వీటి తర్వాత 'చోఖేరబాలీ', 'నౌకాడూబీ' మొదలైన వాటిలో సాంఘిక, చారిత్రక సంఘటనలు కన్పిస్తాయి. 1901 లో రవీద్రుని నవల 'గోరా' వెలువడింది. రవీంద్రుని నవలలు జాతీయ భావనను, జాతీయ స్పృహను కలిగిస్తాయి.

వంగ సాహిత్య చరిత్రలో శరత్‌బాబు నవలలు బంకించంద్ర, రవీంద్రుని నవలల కంటె కూడా జనాదరణ పొందాయి. శరత్ నవలా చక్రవర్తిగా కీర్తింపబడ్డాడు. 'కాశీనాథ', 'బడదీదీ' (1907), 'విరాజబహూ' (1914), 'పల్లీ సమాజ' (1916), 'శ్రీకాంత' (1917), 'శేషప్రశ్న' (1931) 'విప్రదాస' (1933), ఇత్యాది ఎన్నో నవలలు, నవలికలు రాశాడీయన. 'బడదీదీ' నవల పాఠకులను బహుదా ఆకర్షించింది. ఈ నవలతో శరచ్చంద్రుని కీర్తి హెచ్చింది.

శరత్‌బాబు నవలల్లో మొదటిది దేవదాసు. ఇది 1901 లో రాయబడి 1907 లో ప్రకటింపబడింది. ఇతని నవల 'పదేరదాబీ'ని అప్పటి ప్రభుత్వం నిషేధించింది. శరత్‌బాబు 'శేషప్రశ్న', బుద్ధిజీవులు చదవదగ్గ గొప్ప రచన. శేషప్రశ్న అంటే మిగిలిన ప్రశ్న అని అర్థం. నవలా సాహిత్యంలో యుగ పరివర్తన కలిగిన నవల యిది. మానవుల సుఖదుఃఖాలు, స్త్రీల దుఃఖావేదనలు ఈ నవలలో చిత్రించినట్లుగా ఏ రచయితా చిత్రించలేదు. శరత్‌బాబు నవలల్లో జాతీయోద్యమ ఛాయలున్నాయనడం సత్యం.

మహా మహోపాధ్యాయ హరిప్రసాద్ శాస్త్రి (1853-1931) గారి 'బేణీరమేయె' (1920) మంచి చారిత్రక నవల. రాఖాలదాసవంద్యోపాధ్యాయ (1884-1930) గారి 'ధర్మపాల' (1915), ఉత్పల (1929) వంట చారిత్రక నవలలు జాతీయ స్ఫూర్తితో వ్రాయబడ్డాయి. జాతీయ స్పృహ కలిగినట్టివి.

సాహిత్య సాంస్కృతిక రాజకీయాది ఉద్యమాలన్నింటికి వంగదేశమే పుట్టినిల్లు జాతీయోద్యమ ప్రభావం వంగ నవలలపై ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. సమకాలీన జీవితాన్ని, వివిధ సామాజిక సమస్యలను అద్దంపట్టే నవలలు వచ్చాయి. బంకించంద్రుని నవలలు జాతీయ ప్రేరకాలు, దేశభక్తి ప్రపూరితాలు. రవీంద్రుని నవలల్లో జాతీయ భావన, జాతీయ స్పృహ కనిపిస్తుంది. వంగ సాహిత్యంలోని చారిత్రక నవలలన్నీ జాతీయతా భావంతో రచింపినట్టివే.

బంకించంద్రుడు 1872 లో 'వంగదర్శక' అనే మాసపత్రిక స్థాపించి వంగీయుల మేధా సంపత్తికి ఉద్దీపన కల్గించాడు. సాంస్కృతిక పునరుజ్జీవనం తీసుకొని వచ్చాడు. కాబట్టి వంగ నవలా సాహిత్య వినీలాకాశంలో బంకిం చంద్రుడు పున్నమి చంద్రుడుగా చెప్పవచ్చు.

ఇక తెలుగు నవలపై వంగ ప్రభావాన్ని, తెలుగు నవలల్లో ప్రస్ఫుట మయ్యే జాతీయోద్యమాన్ని పరికిద్దాం.

తెలుగు నవలా సాహిత్యంపై (క్రీ. శ. 19 వ శతాబ్దంలో) తొలుత పాశ్చాత్య నాగరికతా ప్రభావం కనిపిస్తుంది. ఆంగ్లానుకరణతో, అనువాదాలతో తెలుగు నవల ప్రారంభమైంది. అటు తర్వాత జాతీయోద్యమాలకు ఆలవాలమైన వంగదేశంనుండి ఆ ఉద్యమ ప్రభావంతో అనువాద, అనుకరణ

నవలలు వచ్చాయి అటు పిమ్మట జాతీయ భావ స్ఫోరకాలైన స్వతంత్ర చారిత్రక నవలలు వెలువడ్డాయి. అనువాద, అనుకరణలతో తెలుగు నవల పరిపుష్టమైంది.

తెలుగు నవలలలో మొదటి నవల నరహరి గోపాల కృష్ణమ చెట్టి 'శ్రీ రంగరాజ చరిత్ర'. ఇది క్రి. శ. 1842 జూన్ 14 న ప్రకటింపబడింది. ఈ నవలపై సంస్కృతాంగ్ల ప్రభావం తక్కువ. అయినా జాతీయోద్యమ ప్రభావం పరోక్షంగా దీనిమీద పనిచేసిందని చెప్పవచ్చు ఎందుకంటే దేశ ప్రజల సాంఘిక దురాచారాలను, అంధ విశ్వాసాలను ఇందులో విమర్శించడం జరిగింది. రచయిత దీన్ని హిందువుల ఆచారాలను తెల్పే నవీన ప్రబంధంగా తీర్చినాడు. వీరేశలింగం పంతులుగారి 'రాజశేఖర చరిత్రము' ద్వితీయమైనా అద్వితీయమైంది దీన్ని వచన ప్రబంధంగా పేర్కొన్నారు. ఈ నవల ఆంగ్ల కవి గోల్డ్‌స్మిత్ 'వికార్ ఆఫ్ ది వేక్ఫీల్డు' అనే ఆంగ్ల నవలానుకరణ. అయినా స్వతంత్ర రచన వలె కన్పిస్తుంది. సంఘ సంస్కరణ ధ్యేయంతో రాయబడింది. పంతులుగారు సత్యవతి చరిత్ర, సత్యరాజా పూర్వదేశ యాత్ర వంటి నవలల్లో చాందస సంప్రదాయాలను, మూఢాచారాలను నిరసించాడు. వీరేశలింగం పంతులుగారి శిష్యుడైన చిలకమర్తి లక్ష్మీనరసింహ పంతులుగారు 'రామచంద్ర విజయము' (1894), 'గణపతి'వంటి నవలల్లో ఆ లక్ష్యాన్ని కొనసాగించారు. ఈ కాలం నవలల్లో సాంస్కృతిక పునరుజ్జీవనం కూడా కనిపిస్తుంది.

తెలుగు నవలకు ఒరవడి దిద్ది ప్రభావితం చేసింది చింతామణి పత్రిక. ఈ పత్రిక చారిత్రక నవలల్ని ప్రోత్సహించి బహుమతులను ప్రకటించింది. చిలకమర్తివారు చారిత్రక నవలలకు ఆద్యులని చెప్పవచ్చు. వారి హేమలత (1894) అహల్యాబాయి (1897) కర్పూర మంజరి (1898) వంటి చారిత్రక నవలల్లో జాతీయోద్యమం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. వీరి నవలలకు చింతామణి పత్రిక బహుమతులు కూడా వచ్చినవి. కేతవరపు వేంకటశాస్త్రి పెక్కు చారిత్రక నవలలు రాసి వాసికెక్కినారు. బొబ్బిలియుద్ధము, రాయచూరు యుద్ధము వీరి నవలలలో ప్రశస్తమైనవి. ఇంకా ధరణిప్రగడ వేంకట శివరావు గారి కాంచనమాల (1908), వేంకట పార్వతీశకవుల వసుమతీ వసంతం

(1911), రాజసింహ (1912), శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి ఆంధ్ర రాజ్య స్థాపన, అక్కిరాజు ఉమాకాంతం గారి టిప్పుసుల్తాను (1913) వంటి చారిత్రక నవలలు జాతీయ భావ ప్రేరితాలు. మన దేశ చరిత్రలో వాసికెక్కిన శివాజీ, రాణా ప్రతాప్ వంటి వీరగాథల్ని, ఉజ్వల సన్నివేశాలను స్వీకరించి పరోక్షంగా జాతీయ భావాలను, దేశ భక్తిని ప్రబోధించిన నవలలు కూడా రచింపబడినవి.

క్రీ. శ. 20 వ శతాబ్ది ప్రారంభంలో ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల, విజ్ఞాన చంద్రికా గ్రంథమాల, వేగుచుక్క గ్రంథమాల వంటి సంస్థలు ప్రచురించిన నవలలు మిక్కిలి ప్రశంసాపాత్రములైనవి. 1905 లో వంగ విభజనతో బంకించంద్రుని దేశభక్తి ప్రబోధాత్మక నవలలకు, అతని వందేమాతరం గీతానికి ఎనలేని ప్రచారం కలిగింది. వంగ నవలలు పెక్కు ఆంధ్రీకరింపబడ్డాయి. శ్రీ వేంకట పార్వతీశ కవులు బెంగాలి నవలలను ఆంధ్రీకరించినారు. వీరేగాక శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రిగారు, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, శ్రీమతి పులుగుర్తి లక్ష్మీనరసమాంబగారు, చాగంటి శేషయ్యగారు పెక్కు వంగ నవలలను ఆంధ్రీకరించినారు.

వంగభాషలో జాతీయ భావాల్ని ప్రస్ఫుటంగా వెలువరించిన బంకిం చంద్రుని ఆనందమఠం (1907), కపాల కుండల (1899) వంటి నవలలు తెలుగులోకి అనువదించబడ్డాయి వీటిని తొలుత ఓ. వై. దొరస్వామయ్య గారు, ఆ తర్వాత వేంకటపార్వతీశ కవులు అనువదించారు. శ్రీ వేంకట పార్వతీశ కవులు సరాసరి వంగభాషనుండి అనువదించక కన్నడంలో శ్రీ వేంకటాచార్యులు అనువదించిన నవలలాధారంగా ఆంధ్రీకరించారు. చాగంటి శేషయ్యగారు బంకించంద్రుని వంగనవలలైన రాధారాణి (1910), నవాబునందిని, దుర్గేశనందిని (1915) అనువదించినారు. దుర్గేశనందిని, నవాబునందిని నవలలు దాదాపు పదిమందిచేత అనువదింపబడి పాఠకుల ఆదరణ పొందాయి బంకించంద్రుని నవలలు ఉత్తేజవంతులను చేశాయి.

విశ్వకవి రవీంద్రుని నవలలు కూడా వంగ భాషనుండి ఆంధ్రీకరించబడ్డాయి. ఆయన శతజయంతి ఉత్సవాల సందర్భంగా (1963) రవీంద్ర కవీంద్రుని నవలల్ని తెలుగులోకి అనువదించబడ్డాయి. 'గోరా' నవల

చాలాకాలం క్రితమే అనువదించబడింది. ఇదే విధంగా శరత్ చంద్రుని నవలలు అనేకం తెలుగులోకి అనువదించబడ్డాయి. శరత్ నవలల ప్రభావం ఆధునిక నవలాకారులపై కనిపిస్తుంది. బెంగాలినుండి అపరాధ పరిశోధక నవలలు కూడా అనువదించబడ్డాయి. అనువదించిన వారిలో వేంకట పార్వతీశ కవులు ఆద్యులు. మాయావి, మాయావని, మనోరమ మొదలైన అపరాధ పరిశోధక నవలలు అంద్రీకరించబడ్డాయి.

భారత జాతీయోద్యమం ఊపు అందుకోకముందే ఆంధ్ర జాతీయోద్యమం తలయెత్తింది. 1913 లో బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిగింది. ఆ ఉద్యమ స్ఫూర్తితో ఆంధ్రుల చరిత్ర కొక కొత్త గౌరవం వచ్చింది. నవలా రచనకు దోహదం చేసింది. అనువాదాలు, మౌలికమైన రచనలు వెలువడ్డాయి.

1915 లో భోగరాజు నారాయణమూర్తిగారు వ్రాసిన ఆంధ్ర రాష్ట్రము (1918) కాకతీయ రుద్రమదేవి కాలానికి సంబంధించిన ఇతివృత్తంగల నవల. కేతవరపు వేంకటశాస్త్రి గారి బొబ్బిలియుద్ధము, రాయచూరు యుద్ధము (1914) మొదలైన నవలల్లో తెలుగు వాతావరణం చిత్రింపబడింది. విజయనగర సామ్రాజ్యం (1914), ప్రమదావనం (1914) వంటి నవలలు జాతీయ భావోన్మీలనతో కూడిన వ్యాఖ్యానంగల రచనలు.

జాతీయోద్యమం ప్రారంభమైన తొలిదినాల్లో తల్లాప్రగడ సూర్యనారాయణరావు రాసిన హేలావతి (1913), వేంకట పార్వతీశ కవుల మాతృమందిరము (1918) వంటి నవలలు హరిజనోద్ధరణ సమస్యలను కథావస్తువులుగా స్వీకరించినవి. 1920 లో వెలువడిన వేలూరి శివరామశాస్త్రి గారి ఆహోబిలం, ఓబయ్యవంటి నవలలు జాతీయ దృక్పథాన్ని, హరిజనులపై జరుగుచున్న అత్యాచారాలను, కులాంతర వివాహ సమస్యను చిత్రీకరించిన స్వతంత్ర తెలుగు నవలలు.

జాతీయోద్యమాన్ని, దాని ప్రభావాన్ని, ఆవశ్యకతను గూర్చి వ్రాసిన మౌలిక తెలుగు నవలల్లో ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి', అడవి బాపిరాజుగారి 'నారాయణరావు', 'కోనంగి' నవలలు, విశ్వనాథ సత్యనారా

యణ గారి 'వేయిపడగలు', బుచ్చిబాబు గారి 'చివరకు మిగిలేది', కొడవటి గంటి గారి 'చదువు', మహీధర రామమోహనరావుగారి 'కొల్లాయి గట్టితే నేమి', ముప్పాళ రంగనాయకమ్మగారి 'బలిపీఠం', మొదలైనవి చెప్పుకో దగ్గవి. ఈ నవలలన్నీ జాతీయోద్యమ ప్రభావంతో రచించినట్టివి.

జాతీయోద్యమ సాహిత్యంలో ఉన్నవ వారి 'మాలపల్లి' (1921) మణి పూసవంటిది జాతీయ సత్యాగ్రహోద్యమాన్ని, అస్పృశ్యత నివారణను, ఇతి వృత్తంగా స్వీకరించినారు. మహాత్ముడు అప్పటికి 'హరిజను'లని నామకరణం చేయలేదు. ఆనాటి సంఘ స్థితి గతులకు అద్దం పట్టిన నవల 'మాలపల్లి.'

ఉన్నవ వారి 'మాలపల్లి' నవలకు వంగ భాషలో బంకించంద్ర చటర్జీ 'ఆనందమఠ' (1882) నవలకు ఎన్నో సామ్యాలున్నాయి. ఈ రెండును రాజకీయ నవలలుగా చెప్పదగినవి. జాతీయ భావాలను ప్రేరేపించినట్టివి. బ్రిటిష కాలంలోని సంఘ స్థితిగతులను, దళిత వర్గాన్ని ఈ రెండు నవలలు వివరించాయి. మత రాజకీయ ఆధ్యాత్మిక విషయాలు స్పృశించబడ్డాయి. ఈ రెండు నవలలు ఆనాటి రాజకీయ ఉద్యమాలకు దర్పణం పట్టినట్టివే. రెండును నిజజీవితానికి చేరువగానున్న రచనలే. జాతిని జాగృతి చేయడానికి రచించినట్టివి. రెండు రచనలు ఆదర్శవంతమైనట్టివి. ఆనందమఠ బంకిం చంద్రుని ప్రతిభా పాటవాల్ని నిర్దేశించినట్లే, 'మాలపల్లి' ఉన్నవ వారి ప్రతిభా పాటవాలకు గీటురాయి.

ఆనందమఠ నవల 1773 లో ఉత్తర వంగ రాష్ట్రంలో జరిగిన సన్యాసుల తిరుగుబాటు ఇతివృత్త మాధారంగా కల్పింపబడింది. 'మాలపల్లి' నవల ఆనాటి సంఘంలోని మత, రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మిక స్థితిగతు లను, అట్టడుగు వారి బాధలను కథావస్తువుగా గ్రహించి రూపొందించినట్టిది.

ఆనందమఠ నవలలో పాత్రల్ని స్వార్థం లేని దేశభక్తులుగా, భగవద్గీత ననుసరించి జీవించే నిష్కామకర్మ యోగులుగా, తమ కంటె ఎన్నోరెట్లు బలం గల బ్రిటిష సేనల్ని ముందు వెనుకలు చూడకుండా ఎదుర్కొనే వీరు లుగా చిత్రించి జాతిని జాగృతపరచినారు. ప్రజలను జాతీయోద్యమోన్ముఖులుగా చేయుటకు ఆధారభూతమైన నవల. ఉన్నవ వారి మాలపల్లి నవల కూడా

జాతిని జాగృతం చేయడానికి, రాజకీయ ఉద్యమాలకు, పోరాటాలకు వస్తాసుగా నిలబడిన నవలగా చెప్పవచ్చు.

ఆనందమఠ నవల ఆనాటి వంగదేశ సమస్యలకు అద్దం పట్టినట్లే, ఉన్నవ వారి నవల ఆంధ్రదేశంలో ఆనాటి సమకాలీన సామాజిక సమస్యలకు అద్దం పట్టింది. బంకించంద్ర ఆనందమఠ నవల అప్పటి ఘోరదశామానికి బ్రిటిషు వారే కారకులని ఆ నవలలోని విప్లవ వీరులు నిశ్చయించినట్లు, వాళ్ళని ఎదుర్కొనడం తమ కర్తవ్యంగా ఆ నవల యందలి సన్యాసులు నిర్ణయించు కున్నట్లు చిత్రించడమేగాక, దేశభక్తికి నిర్వచనం చెప్పి, 'వందేమాతరం' అనే జాతీయ మంత్రాన్ని ప్రజలకు ఉపదేశించి వాళ్ళ దృక్పథాన్ని మార్చిన ఘనత ఈ నవలది. ఉద్యమం వైపు నడిచేటట్లు చేయగలిగిన శక్తివంతమైన సాధనం వంగ భాషలోని బంకించంద్ర రాసిన ఆనందమఠ నవల. జాతీయ స్ఫూర్తినిచ్చి నట్టిది కాపుననే పలు భాషలలోకి అనువదించబడింది.

ఉన్నవ వారు 'మాలపల్లి' నవలలో కూడా వర్ణ, వర్గ వ్యవస్థల గురించి, జాతీయ సత్యాగ్రహోద్యమాల గురించి వివరించి, బ్రిటిషు పాలనలో పోరాటం తప్పనిసరి అనే భావాన్ని కల్గించి, దేశభక్తిని ప్రేరేపించినారు. అల్లూరి సీతారామరాజు మన్య పోరాటాన్ని, గాంధీజీ సిద్ధాంతాలను కన్నులకు కట్టినట్లు వర్ణించి జన జాగృతి కలిగించి, జాతీయోద్యమం వైపు నడిపించే శక్తి సాధనంగా నవలను తీర్చిదిద్దినారు.

ఈ విధంగా వంగ నవల 'ఆనందమఠ' ఉన్నవ వారి తెలుగు నవల 'మాలపల్లి' ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకున్నవి. వంగ నవల ప్రభావం పరోక్షంగా తెలుగు నవలపై ఉన్నట్లు పేర్కొనవచ్చు.

జాతీయోద్యమ కాలంలో వెలువడిన రాజకీయ, చారిత్రక నవలలన్నీ జాతివిముక్తికై జరుగుతున్న పోరాటాలను, వర్తమాన రాజకీయ సంఘర్షణలను, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో చిత్రించి దేశభక్తిని ప్రబోధించినవి. జాతీయ భావాలతోపాటు ప్రజలలో సామాజిక చైతన్యాన్ని తీసుకొని రావడానికి నవలా ప్రక్రియ ప్రయత్నం సాగించింది.

వంగదేశ సాహిత్యంలో ముఖ్యంగా బంకించంద్ర చటర్జీ నవలలు అధికంగా తెలుగు నవలను ప్రభావితం చేశాయి. జాతీయోద్యమానికి స్ఫూర్తి

నిచ్చింది. రవీంద్రుని నవలలు, శరత్‌బాబు నవలలు, కొన్ని అపరాధ పరిశోధక నవలలు కూడా తెలుగు నవలల పై అధిక ప్రభావం చూపగల్గినవి. బెంగాలి నవల పాటకో నడిచిన, నడుస్తున్న నవలలు తెలుగులో చాలా కనిపిస్తాయి. అనువాదానికి అనుకరణలే గాక తెలుగులో జాతీయోద్యమ ప్రభావంతో మౌలిక నవలలు కూడా వెలువడినట్లు తేలింది. ఉన్నవ వా. మాలపల్లి నవల, బంకించంద్రుని ఆనందమఠ్ నవలకు గల సామ్యాలను తులనాత్మకంగా ప. శీలించబడింది.

జాతీయోద్యమ భావాలను ప్రతిధ్వనించి సంఘ చైతన్యాన్ని కల్గించిన ఆధునిక ప్రక్రియ నవల. స్వరూపంలో వైదేశికమైనా స్వభావంలో మాత్రం దేశీయభావ స్ఫోరకమైంది. ఆధునిక సాహిత్య ప్రక్రియ నవల స్థానం అద్వితీయం.

## సంప్రదించిన గ్రంథాలు


1. వంగ సాహిత్య చరిత్ర, మూలం సుకుమార్ సేన్, తెలుగుసేత : కొత్తపల్లి వీరభద్రరావు, సాహిత్య అకాడమి, న్యూఢిల్లీ (1972).
2. తెలుగు నవలా వికాసం, మొదలి నాగభూషణ శర్మ, నాట్యకళా ప్రెస్, హైదరాబాదు (1971).
3. ఉత్తర భారత సాహిత్యములు, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు (1965).
4. తెలుగు సాహిత్య సమీక్ష, రెండవ సంపుటము, డా॥ జి. నాగయ్య, నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి (1985).

# ఆంధ్ర సాహిత్యాలలో సిరియాళ కథ

ద్రవిడ దేశంలో శైవమతోద్ధరణ కోసం అవతరించి తన్మత వ్యాప్తికి తోడ్పడిన వారు నాయన్మారులు. నాయనార్ అంటే తమిళంలో దేవుడని (కడవళ్), దాసుడని అర్థం. వీరి మహిమాదుల వల్ల దక్షిణ భారతదేశంలో జైన బౌద్ధ మతాలు తమ ప్రాభవాన్ని కోల్పోయి, శైవమతం జనాదరణ పొందింది. నాయన్మారులు శైవ ప్రపూర్ణాలైన గీతాలనేకం రచించారు. ఆ శైవ గీతికా కదంబానికి 'తిరుమరై' అని పేరు. నాయన్మారులు అరవై మూడు మందని ప్రతీతి. వారిలో ముప్పదిఆరవవాడు మన సిరియాళుడు. ఇతడు దృఢవ్రతుడు, వీర శైవాచార సంపన్నుడు, త్యాగనిరతుడు, చారిత్రక వ్యక్తి. క్రీ.శ. 630 ప్రాంతంలో జీవించినట్లు తమిళ శాసనాల వల్ల తెలుస్తున్నది.

నాయనారులలో తిరుజ్ఞాన సంజంధర్, అప్పర్ స్వామిగళ్, సుందర మూర్తి నాయనార్, మణిక్యవాశగిల్ అనువారు ప్రముఖులు. వీరికి శైవ సమయాచారులని పేరు. వీరిలో మొదటి ముగ్గురు చేసిన శివ స్తవసంచయానికి 'తేవార'మని పేరు వీరందరు క్రీ.శ. 7వ శతాబ్దికి చెందినవారు. తిరుజ్ఞాన సంబంధర్, అప్పర్‌స్వామిగళ్ సిరియాళునికి సమకాలికులు. వీరి కాలంలో శైవమతం ఉద్రేకమై వీర శైవరూపాన్ని పొందింది. వీరశైవులు శివుని యందు శరీరాభిమానాన్ని త్యాగం చేస్తారు. భక్తులు తమ నేత్రాల్ని, భార్యా బిడ్డలను, చివరకు ప్రాణాలను సైతం శివార్పణం చేసి కైవల్యాన్ని పొందా

లని వీరి సిద్ధాంతం. వీర శైవులు జంగమదేవరలను సాక్షాత్ శివునిగా భావించి భజిస్తారు.

ఆంధ్రదేశాన్ని పాలించిన తూర్పు చాళుక్యులకు, ద్రవిడ దేశాన్ని ఏలిన చోళరాజులకున్న సంబంధ బాంధవ్యాల వల్ల శైవ భక్తి, శైవ భక్తుల కథలు ద్రవిడదేశం నుండి, తెలుగుదేశానికి వ్యాపించాయి. భక్తిప్రధానమైన శైవంపై జన సామాన్యానికి గాఢ విశ్వాసం ఏర్పడింది.

శివభక్తుల కథలలో సిరియాళుని కథ జనసామాన్యాన్ని బాగా ఆకట్టుకుంది. అతని భక్తి తత్పరతను, పరమేశ్వరుని పరీక్షకులోనైన విధానాన్ని జానపదులు పాటలుగా గట్టి పాడుకొనేవారట. ఈతని కథ తమిళం నుండి తెలుగు, కన్నడ, సంస్కృత సాహిత్యాలకు ప్రవేశించింది. మహారాష్ట్రలో కూడా ధార్వాడ నాటక సమాజం వారు సిరియాళ కథను నాటకంగా రూపొందించి ప్రదర్శించారని తెలిసింది.

తమిళంలోనుండి ఇతర భాషల్లోనికి ప్రవేశించే సమయంలో కథ మార్పులకులోనవడం సహజం. కాని వ్యక్తిగత నామాలు కూడా మార్పులకు లోనయ్యాయి.

చిరుతొండనిగా పేరొందిన సిరియాళుడు తమిళంలో పరంజ్యోతియార్. సంస్కృతంలో భద్ర భక్తుడు. నంజుందేశ్వరాలయంలో ఇతని పేరు ధర్మకేతుడని లిఖింపబడింది. తమిళంలో మహామాత్రుల వంశజుడు (బ్రాహ్మణుడు), కన్నడాంధ్ర సాహిత్యాలలో వైశ్యుడుగా చెప్పబడింది. సిరియాళుని భార్య తిరువేంగట్టు మంగయార్, తిరువెంగనాంచిగ, సంగళవ్వగా, శ్రీ శ్వేత వన నాయికిగ చెప్పబడింది. తమిళంలో సిరియాళుని నివాస స్థానం తిరుచెంగాట్టంగుడి అనే గ్రామం. కన్నడాంధ్రములలో చోళదేశానికి చెందిన కాంచీపుర నివాసిగా చెప్పబడింది. ఈ విధమైన వ్యక్తి, గ్రామ నామాల మార్పువల్ల పాఠకుడు కొంత గందరగోళానికి లోనయ్యే అవకాశం ఉంది.

తమిళాంధ్ర సాహిత్యాలలో పలు ప్రక్రియలలో వెలుగొందిన సిరియాళుని కథను స్థూలంగా తెలుసుకుందాం :

## మూల కథ

కాంచీపురంలో సిరియాళుడనే వైశ్య శ్రేష్ఠుడుండేవాడు. నిత్యం ఏవురు జంగాలకు తప్పక ఆతిథ్యమిచ్చే శిష్టవ్రతం గల శివభక్తుడు. పరమేశ్వరుడు తన భక్తుడైన 'సిరియాళుని' పరీక్షించాలని జంగంరూపంలో వస్తాడు. తనకున్న ఏకైక పుత్రుని మాంసం చేసి వండి ఆతిథ్యమిమ్మంటాడు. అందుకు సిరియాళుడు అంగీకరిస్తాడు. అతని భార్య సంగళవ్వ కూడా సమ్మతిస్తుంది. చదువుకోసం వెళ్ళిన పిల్లవాణ్ణి పిలిపించి, వధ్యశృంగారం చేయించి నిండారుమనంతో ఆ బాలుని ఖండించి నానాప్రకారాలైన శాకాలు వండి ఆహారంగా పెట్టినారు. ఆ తాపసి వాటిని చూచి ఉత్తమాంగమైన శిరోమాంసం లేదని ఆతిథ్యం స్వీకరింప తిరస్కరిస్తాడు. పుత్రునిపై ప్రేమతో శిరస్సు దాచినారని ఆపాదిస్తాడు. ఇది వ్రతవిరుద్ధమంటాడు. వెంటనే సిరియాళ దంపతులు ఆ జంగమదేవరను ఒప్పించి శిరోమాంసం పాకంచేసి వడ్డిస్తారు. ఆ తాపసి సిరియాళుని ప్రస్తుతించి, తన పంక్తిలో కూర్చొని కొడుకు మాంసం ప్రీతితో తినకున్నచో ఆతిథ్యమక్కరలేదంటాడు. అందుకుకూడా అంగీకరించగా, ఆ తపోధనుడు పుత్రులు లేనింట భోజనం చేయనంటాడు. లేని పుత్రుని వారెక్కడ తేగలరు? ఆ తాపసి ఆదేశానుసారం ఎలుగెత్తి 'శ్రీ నిలయుడ, సీరాల రావే!' అని ఆ తల్లి తనయుని పిలుస్తుంది. గరళకంఠుని మహిమచే సీరాలు'డనే పేరుగల ఆ బాలుడు పరుగున చెంతకు వస్తాడు. జంగముడు అంతర్ధానమై పరమేశ్వరుడుగా దర్శనమిస్తాడు. శివసాయుజ్యం అనుగ్రహిస్తాడు. శివుడా భక్తివరుని చిఱుతొండా రమ్మని పిలుస్తాడు. తమిళంలో చిఱుతొండడనగా పవిత్రమైన భక్తుడని అర్థం. చిరుతొండడనే పేరు సార్థక నామధేయమైంది. శివభక్తి మహిమను చాటే ఈతని కథ తమిళాంధ్ర సాహిత్యాలలో పండిత పామర రంజకమై ఉంది.

## తమిళ సాహిత్యంలో సిరియాళ కథ

నాయన్మారుల జీవిత విశేషాలను వివరించే తమిళ గ్రంథం 'పెరియ పురాణం, దీనికి శైవ వాఙ్మయ చరిత్రలో ప్రముఖ స్థానముంది. ఈ గ్రంథా

నికి శ్రీభక్తవిజయమని అర్థంవచ్చే తిరుత్తొండ పురాణమని నామాంతరం. మతపరంగానే గాక సాహిత్యపరంగా కూడా పెరియపురాణం అమూల్యమైంది. దీని కర్త సేక్కియార్ అనే కవి. ఈ కవిని అరుణ్ మొళిదేవర్ అని కూడా పిలుస్తారు. ఇతడు రెండవ కులోత్తుంగుని (క్రీ. శ. 1133 - 1150) కాలంవాడు.

పెరియపురాణంలో 'చిఱుతొండ నంబియార్' పేరుతో ఈ కథ ఉంది. ఇందు సిరియాళుడికి "చిరుతొండనయనం" అనే పేరుంది. అతని కొడుకు పేరు సిరాళుడు. నివాస స్థానం తిరుచెంగాట్టంగుడి అనే గ్రామం. (బసవ పురాణంలో కంచిగా చెప్పబడింది) భార్య పేరు 'తిరువెంగాట్టు మంగయార్'. చిరుతొండ అనేది అతని కిచ్చిన బిరుదు. పెరియపురాణాన్ని బట్టి చిఱుతొండని మొదటి పేరు పరంజ్యోతియార్. మహామాత్రుల వంశంలో పుట్టాడు. వీరు బ్రాహ్మణులని ప్రతీతి. వేదాధ్యయన సంపన్నుడు. ఆయుర్వేదంలో నిష్ణాతుడు. పరంజ్యోతి మొదట్లో పల్లవ నరసింహరాజా అమాత్యుడుగా ఉండేవాడు. మహా పరాక్రమవంతుడు. దండనాయకుడు. ఒకసారి రాజాజ్ఞ ప్రకారం చతురంగ బలసమేతుడై రెండవ పులకేశి రాజుపైకి దండెత్తి ఉత్తరవాతాపిని వశపరచుకొని విజయలక్ష్మితో తిరిగి వచ్చినట్లు చారిత్రకాధారములనుబట్టి తెలుస్తున్నది. అంతేకాక వాతాపిలో ఉన్న ఒక గణపతి విగ్రహాన్ని తరలించుకొని వచ్చి తన గ్రామంలో ప్రతిష్ఠించాడు. నేటికీ తంజావూరు జిల్లాలోని 'తిరుచ్చెంగాట్టంగుడి' అనే గ్రామంలో పరంజ్యోతి యొక్క యుద్ధ విజయ చిహ్నంగా వాతాపి గణపతి ఆలయం ఉంది. వాతాపిగణపతి మందిరంలో చిరుతొండని విగ్రహం, అతని భార్య తిరువెంగాట్టు మంగయార్ విగ్రహం, వాళ్ళ కొడుకు 'సీరాల' విగ్రహాలున్నాయి. భరణీ నక్షత్రం రోజున సిరియాలుని భక్తి పరీక్షింపబడిందని అక్కడి జనుల నమ్మకం. అందుకే ప్రతి చైత్రమాసంలో భరణీనక్షత్రం రోజున చిరుతొండని స్మారకోత్సవం జరిపే ఆనవాయితి ఉందట.

పరంజ్యోతియార్ పరమ శివభక్తుడు. అతని విజయానికి కారణం శివానుగ్రహమని చెప్పబడింది పరంజ్యోతియార్ శివభక్తుడని తెలుసుకొని ఆయనచే హింసాకాండ జరిపించినందుకు పల్లవ నరసింహరాజా పశ్చాత్తాప పడతాడు. అప్పటినుండి యుద్ధాలకు పంపక, అతనికి కావాల్సిన అగ్రహారాదులిచ్చి, ఆర్థిక సౌలభ్యాన్ని కలిగించి శివారాధనలో గడపమని కోరుతాడు.

అప్పటినుండి పరంజ్యోతియార్ లౌకిక విషయాలను పరిత్యజించి అహర్నిశలు శివపాద సేవలో గడుపుతాడు. జంగను సత్కారాదుల్లో నిమగ్నుడై, నిత్యం శివభక్తులకు ఆతిథ్యమివ్వక భుజించేవాడుకాదు. ఇది దైనందిన ఆచారమైంది. అతడు గృహస్థు ధర్మాన్ని ఆచరిస్తూ శైవులకు నిత్యం భోజనం పెట్టే దృఢవ్రతంతో కాలక్షేపం చేస్తుండగా, ఆ దంపతులకు 'సీరాల' అనే పుత్రుడు జన్మించాడు. ఆ బాలుని చదివించుటకై గురువుల దగ్గరకు పంపించాడు. భక్తులందరికన్న తాను చివరివాడనని భావించేవాడు. కనుకనే పరంజ్యోతియార్ చిరుతొండరుగా ప్రసిద్ధి చెందాడు. తమిళంలో తొండర్ అనగా భక్తుడని అర్థం. చిరు అనగా చిన్న. కాలక్రమేణ చిరుతొండడనే పేరు స్థిరపడి పరంజ్యోతియార్ పేరు మరుగు పడింది. ఈ వృత్తాంతం తెలుగు కథలలో ఎచ్చటా కనిపించదు. కేవలం భక్తుడుగా మాత్రం దర్శనమిస్తాడు. పరంజ్యోతియార్ చిరుతొండడుగా ప్రసిద్ధి కెక్కిన తర్వాత శివుడు పరీక్షింపగోరి భైరవ జంగమ రూపంతో రావడం, కుమారుని మాంసం చేసి వడ్డించమని కోరడం, తదాదిగా గల వృత్తాంతం స్థూల కథలో చెప్పినట్లుగానే తమిళ పెరియ పురాణంలో కూడా ఉంది. నిశ్చల భక్తి మూర్తీభవించిన భక్తుడుగా తమిళ సాహిత్య కథలో సిరియాళుడు కనిపిస్తాడు.

తమిళంలో పెరియ పురాణానికి ముందు తిరుజ్ఞాన సంబంధర్ వ్రాసిన 'తేవారం' లోను, శివపురాణం మొదలైన వాటిలోను చిరుతొండని ప్రసక్తి ఉంది. ఆధునికంగా పుగళేంది అనే తమిళ కవి 'చిరుతొండ భక్తన్ కథై' అనే పేరులో సిరియాళ కథను నాటకంగా రూపొందించారు. తమిళ జానపద సాహిత్యంలో కూడా సిరియాళుని కథ ఉంది.

## తెలుగులో సిరియాళ కథ

తెలుగు సాహిత్యంలో సిరియాళ కథ బహుళ ప్రాచుర్యాన్ని పొందింది. తెలుగులో మొట్టమొదట మల్లికార్జునుని (క్రీ.శ. 1100-1190) శివతత్త్వసారంలో సిరియాళుని ప్రశంస ఉంది. వృషాధిప శతకం, చతుర్వేదసారం, పండితారాధ్య పురాతన ప్రకరణంలో వీరి ప్రసక్తి ఉంది. పాల్కురికి సోమనాథుడు (క్రీ.శ. 1160-1240) బసవ పురాణంలోను, శ్రీనాథ కవి (1885-

1475) హరవిలాసం కోను సిరియాళుని కథ వర్ణింపబడింది. ఇంకా తెలుగులో వివిధ ప్రక్రియల్లో పలువురు రచించి యున్నారు. జానపద సాహిత్యంలో గేయ కథగా వ్యాప్తిలో ఉంది. తెలుగులో గల కథను స్థూలంగా తారతమ్య దృష్టితో పరిశీలిద్దాం.

పాల్కురికి సోమనాథుడు (క్రీ.శ. 1160-1240) తనకాలం నాటికే జానపదులు పాటలుగా కట్టి సిరియాళ చరిత్ర పాడేవారని, నాటకంగా ఆడే వారని బసవపురాణంలో పేర్కొన్నాడు చూడండి.

"............... ధరణి లోపలను
గరమర్థి నూహూర సిరియాళు చరిత్ర
మేటియై తను భక్త కూటువలందు
బాటలుగా గట్టి పాడెడి వారు
బ్రస్తుతోక్తుల గద్య పద్య కావ్యముల
విస్తారముగా జేసి వినుతించు వారు
నట్లుగాక సాంగభాషాంగ క్రియాంగ
పలునాటకంబుల నటియించు వారు
మునుమాడి పీరు వారన నేలః కూడి
కనుగొనరోళ్ళ రోకళ్ళ బాడెదు వారు"

(బసవ పురాణం 4 వ ఆశ్వాసం)

అంతగా జానపదులలో సిరియాళ కథ వ్యాప్తిలో ఉండేది. కాని పాల్కురికి ముందున్న జానపద కవిత్వం లభ్యం కావడం లేదు.

పాల్కురికి సోమనాథుడు బసవపురాణం చతుర్థాశ్వాసంలో 186 ద్విపద పంక్తులలో చెప్పిన సిరియాళుని కథమాత్రం లభిస్తుంది. సిరియాళకథకు తమిళమే మూలమైనా కన్నడంలో బసవన్న (క్రీ. శ. 1160-1185) రచించిన సిరియాళసెట్టి కథను, జనుల నోళ్ళలో నున్న కథను గ్రహించి కొన్ని కల్పనలతో బసవపురాణంలో సిరియాళుని కథను పాల్కురికి వ్రాశాడు.

వీర శైవ మత ప్రతిపాదకాలైన కథలలో సిరియాళ కథ ఒకటి. వీర శైవ భక్తులకు అహంకారం కూడదు "విను మహంకరించినను భక్తి యగునే" అను దానికి దృష్టాంతంగా సిరియాళుని కథ చెప్పబడింది. తమిళ పెరియ పురాణంలో చిరుతొండనిగా పేరొందిన పరంజ్యోతియార్ బసవ పురాణంలో సిరియాళుడుగా పిలువబడ్డాడు. బహుశా అప్పటికి ప్రజా బాహుళ్యంలో వ్యాప్తి యందున్న పేరు కాబోలు. శివ సాయుజ్యం పొందిన తర్వాత శివుడు భక్తుడైన సిరియాలుని చిరుతొండా! (పవిత్రమైన భక్తుడా) అని సంబోధించినట్లు పాల్కురికి కథనం సహేతుకంగా ఉంది. సిరియాలుడు కాంచీపురి నివాసిగా, వైశ్యునిగా పేర్కొన్నారు. ఇందలి కథ అంతా ఈ వ్యాసములో స్థూలకథగా చెప్పిన కథయే.

కథాంతంలో మాయా తపసి ఆదేశానుసారం సుతుని ఆ తల్లి ఎలుగెత్తి పిలిచె తీరు కరుణరసాత్మకంగా వర్ణింపబడింది. తిలకించండి.

"పూర్వ జన్మార్జిత భూరికర్మముల
గర్వణగించు నా కొడక రావయ్యా
దక్షవాదీశ్వరు దర్పమడంచు
దక్షత గల్గు నాత్మజుడ రావయ్య
.... ... .... ....
పాయనివ్యామోహ పాశబంధములు
కోయంగ జాలునా కుఱ్ఱ! రావన్న
.... .... .... ....
శ్రీనిలయుండ నా సీరాల రావే!" (బస. 4. ఆ. 151)

అని పిలిచే సమయంలో పాఠకుడు కరుణరసప్రవాహంలో కొట్టుకొని పోక తప్పదు శివానుగ్రహంచే ఆ బాలుడు తల్లిని చేరవచ్చే ఘట్టంలో, ఆనంద తన్మయులమవుతాం. అద్భుత రసపోషణ చక్కగా జరిగింది. కథ మొత్తంపై భక్తిపీరం పోషింపబడింది

శ్రీ నా థు ని హ ర వి లా సం లో ని చి రు తొం డ ని క థ

శ్రీనాథకవి (క్రీ. శ. 1385-1475) తన హర విలాసంలో మొదటి రెండాశ్వాసాలలో 'చిరుతొండనంబికథ' పేరుతో 212 గద్య పద్యాలలో చిత్రింపబడి ఉంది. బసవపురాణంలోవలె ఇందు సిరియాళుడని పేర్కొలేదు

చిరుతొండనంబిగా పేర్కొన్నాడు. తమిళ సాహిత్యంలోను, బసవపురాణం లోను లేని విధంగా మాయా జంగమ (శివుడు) జోగిత (పార్వతి) పాత్రం సృష్టించి, దాని పేరు చందనికగా చెప్పాడు. చిరుతొండనుని పూర్వజన్మ వృత్తాంతం కథకు ఉపోద్ఘాతంగా చెప్పబడింది. పూర్వ జన్మలో చిరుతొండడు తుంబురుడనే ప్రమథుడు. దుర్వాసముని శాపంవల్ల చిరుతొండనంబిగా జన్మించి నట్లు శ్రీనాథుని కథనం. కుమారస్వామియే సీరాలుడని, గంధర్వ స్త్రీ తిరువెంగనాంచియని, అప్సరదాసి చంద్రికయని, కొన్ని కారణాలవల్ల భూలోకంలో పుట్టినట్లు శ్రీనాథుని హరవిలాసంలో చెప్పబడింది. ఇది మూలానికి భిన్నమైన కల్పన.

పాత్రల మార్పేగాక శ్రీనాథుడు కథా గమనంలో కూడా కొన్ని మార్పులు చేశాడు. కథా సందర్భాన్ని వివరిస్తూ - ఒకానొక మిండ జంగం శివుని అభిషేకానికి తూమెడు చెరకు రసం కావాలని కోరగా చిరుతొండడు చెరుకు గడలను మోపు కట్టి ఎత్తుకోలేకపోవడం, శివుడు కైలాసంనుండి భక్తునికోసం వచ్చి అతనికి సాయం చేయడంవల్ల చిరు చెమట పట్టడం, పార్వతీదేవి ఆ చెమటను చూచి సాత్త్విక స్వేదమని భ్రమించి కేళికమలంతో తాకగా, అందుకు కారణం చిరుతొండనంబి యనే భక్తుడని చెప్పగా అతనిని పరీక్షించుటకు పార్వతీ పరమేశ్వరు లిద్దరు భూలోకానికి వచ్చినట్లు శ్రీనాథుడు కల్పన చేశాడు.

పార్వతీ పరమేశ్వరులు తిరువెంగనాంచిని, చిరుతొండనుని కార్యవిముఖులుగా చేసేందుకు యత్నించి విఫలులైనట్లు కూడా శ్రీనాథుడు కథా కల్పన చేశాడు. చిరుతొండడు జంగమారాధన చేయగలడా! లేదా! పరీక్షింపతలచి ఇరువది ఒక్క రోజులు వరసగా వర్షాన్ని కురిపించుమని హరుడు ఇంద్రుని ఆజ్ఞాపిస్తాడు. అంతటి వర్షంలో కూడా చిరుతొండనంబి జంగమారాధన యధావిధిగా జరిపిస్తాడు. వాన వెలసిన రోజు ఒక్క జంగం కూడా అతిథ్య మీయడానికి కనిపించరు! ఊరవతల శతాధిక వృద్ధులు కనిపించినట్లు, వారికి విభూదినిచ్చి భోజనానికి పిలువగా ఆ దంపతులు ఘోర శివ తపంలో వున్నామని దానికి "ఉద్యావనంబు పశూపహార పాక మొనరించి వడ్డింప భవున కొసగి, కుడుతునా పంక్తినిలుతేడు కొడుకు గుడువ" (హ వి. 2 ఆ. 54 పు) అని

మనోరథాన్ని తెల్పుతారు. అందుకు తమ సుతుని యివ్వడానికి సమ్మతించారు. ఆ యోగి బాలుని దగ్గరకు వెళ్ళి "నీ తండ్రి దుర్మార్గుడు, లేకపోతే ఎవరైనా కన్న కొడుకును చంపుకొనేందుకు అంగీకరిస్తారా!" అని ఆ బాలుని అభిప్రాయం తెలుసుకోడానికి అంటాడు. ఆ బాలుడు ఆ జంగమ వేషధారి మాటలు పెడచెవి పెడతాడు. శివుడు బాలుణ్ణి పరీక్షించే ఘట్టం బసవ పురాణంలో లేదు. ఇత్యాది బసవపురాణంలో లేని కల్పనలు హరవిలాసంలో చోటు చేసుకున్నాయి. 'తమిళ విందు'లో ఆచార్య చల్లా రాధాకృష్ణ శర్మ గారన్నట్లు కథకు పౌరాణిక వాతావరణం కల్పించబడింది. ఈ విధంగా శ్రీనాథుడు చిరుతొండనంబి కథను చిత్రించాడు.

ఆత్తలూరి పాపకవి 'హరిభక్త విలాసము' అను పేరుతో ఐదువేల పద్యాలు, ఐదాశ్వాసాలుగల ఒక మహాకావ్యం రాశాడు. ఇది అముద్రితం. ఇందు నాయనార్ల చరిత్రలు వర్ణింపబడినాయి. ఆ గ్రంథం పెరియ పురాణానికి దీటైనది.

సిరియాళ కథ ప్రత్యేక ద్విపద కావ్యంగా, ప్రబంధంగా, యక్షగానంగా, నాటకంగా, జంగం కథగా, పదంగా తెలుగులో వివిధ ప్రక్రియల్లో కనిపిస్తుంది. చిత్తూరు గంగాధర కవి సిరియాళచరిత్ర పేరుతో ద్విపదకావ్యంగా రచించాడు. ఇతని కాలం క్రీ. శ. 1823 ప్రాంతం. ఈ కృతి రాచవీటి వీరభద్రునకు అంకిత మీయబడింది. ఇది అముద్రితం. ఈ కథ శ్రీనాథుని హరవిలాస కథను అనుసరించి వ్రాయబడింది. దేశీయ వర్ణనలతో నిండి ఉంది. శివుని మాయాజంగంవేషధారణ చూడండి.

"చికిలికి జడలను చివికిన బొంత
వికవిక నవ్వుల వెర్రి బాగులూను
భిక్షపాత్రయు ఒక పిడికుంట శంఖు
కకపాలము పల్లగాజు గిండ్డియూను
యోగజోపుడు సంచియిత్రి చర్మంబు
పెరిగిన పుండ్లను పేనిక్కు కన్నులూను

మిట్టయిన నుదురును మిడిగుడ్లువండ్లు
చప్పి రవడలు రుద్రాక్ష మాలికలు
నవరత్న హావాలు నడుయోగ వట్టె
హరహరా యనుచు"

వచ్చినట్లు వర్ణింపబడింది. జంగమ దేవర వేషాన్ని ఈ వర్ణన చక్కగా కళ్ళకు కట్టినట్లు చూపిస్తుంది.

ఈ కథలో బాలుణ్ని చంప బోయేముందు -

"హర హర యనకు మీ ఆయుధము తెగాదు

శివ శివ యనకు శిరసును తెగాదు" - అని చెప్పబడింది.

శివున్ని తలిస్తే ఆపదలు శివుడు తొలగిస్తాడని హర హరా! శివ శివా! అన వద్దని చెప్పడం సహేతుకంగా ఉంది.

చిత్తూరు గంగాధర కవి కథలో బ్రతికిన బాలుణ్ణి చూచి ఆ యోగి తల్లిదండ్రులను నిందించడం, అందుకు ఆ యోగి యెదుటనే కొడుకును మరలా చంపడానికి పూనుకోగా, శివుడు ప్రత్యక్షమై ఖడ్గాన్ని పూలమాలగా మార్చి అందరిని కైలాసానికి తీసుకొని పోయినట్లు కథలో కొంత మార్పు చేశాడు.

సిరియాళ కథను తెల్పే ప్రబంధం కూడా ఉంది. గరికపాటి తమ్మయ్య- 'సిరియాళ చరిత్రము' పేరుతో వ్రాసిన మూడాశ్వాసాల ప్రబంధం. చిరుతొండ డను వీరశైవ భక్తుని చరిత్ర ఇందు వర్ణింపబడింది. ఇది అముద్రితం. శ్రీ వేంక టేశ్వర విశ్వవిద్యాలయం ప్రాచ్యలిఖిత గ్రంథమందున్నది. ఈ కవి శ్రీనాథుని కథను, చిత్తూరు నాగాధర కవి కథను, (I. R. No. 413 P. L) ఆధారంగా చేసుకొని రచించాడు. ఈ కవి 19 వ శతాబ్ది ప్రారంభంలోని వాడు కావచ్చు.

వాలె కోటయ్య కవి 'చిరుతొండ భక్త నిధానము' అనే పేరుతో యక్ష గానం రచించారు. ఇది 1989 లో ముద్రితం. పరిష్కర్త కె. ఆనందన్. ఈ యక్షగానం ఏకామేశ్వరునికి అంకిత మీయబడింది. ఈ కృతికి ప్రోత్సాహ కుడు మంచికంటి నాగలింగయ్యని చెప్పబడింది. కథ బసవపురాణం కథను,

చిత్తూరు గంగాధర కవి కథను చూచి యక్షగానంగా రూపొందించినట్లు తెలుస్తుంది. శివయోగి బాలునికి రాబోయే ఆపదను గురించి తెల్పి ఎక్కడికైనా పారిపోయి ప్రాణాలు కాపాడుకోమంటాడు. ఆ పిల్లవాడు మా తండ్రి పట్టిన వ్రతాన్ని వలుచగా చేయడం నావల్ల కాదంటాడు. ' ఒక యోగికి తల్లి దండ్రుల చేతుల్లో చంపబడి ఆహారం కావడం వల్ల ఈ లోకములోనే సాయుజ్యము వస్తుందని వేదాంత వాక్యాలు చెపుతాడు.

ఇందు తల్లి పిల్లవాణ్ణి శివయోగి ఆదేశానుసారం పిలిచే సమయంలో ఏలలు రచింపబడ్డాయి.

'పూర్వకర్మార్జితమైన భూరి కర్మముల నెల్ల
గర్వమణంచిన కొడుకా! రావయ్యా! ఓ నా చిన్ని తండ్రి
శర్వునాజ్ఞ మీర బోకయ్యా,
దక్షిణాధీశుని పట్టి దర్పమణచినట్టి శివుడు
యీ క్షణాన వచ్చియున్నాడు ఓ ముద్దు తనయ
మోక్షమంద వేగ రావయ్యా' . అని ఏలలు కూర్చబడింది.

ఇతని కాలం సరిగా తెలియదు. బహుశా 19వశతాబ్దంవాడు కావచ్చు.

చిరుతొండ నాటకము అను పేరు గల మరొక యక్షగానాన్ని సిద్దేశ్వర పబ్లికేషన్స్, హైదరాబాదు వారు 1987లో ప్రకటించి యున్నారు. 'వెంకటరావు పేట వెంకటదాసుండు విశ్వేశు పేర, అంకితము గావించినట్లు తెలుస్తున్నది. ఇందు దరువులు, సంవాదాలు, ద్విపదలు, వర్ణనలు పెక్కులున్నాయి. చిరుతొండని భార్య సుగ్గులా దేవిగా చెప్పబడింది. చిరుతొండడు మహారాజుగా పిలువబడ్డాడు. వీరికి సంతానం లేక అరణ్యాలకు వెళ్ళి, ఒంటిపూట భుజించి పెక్కు సంవత్సరాలు తపసు చేయగా, పరమేశ్వరుడు వచ్చి వరము వేడుమనగా - కులముద్ధరించు పై హనాంగుని తనయునిగా కోరినట్లు - శివుడు ఆ విధంగా వరమీయగా, శ్రీయాళుకుడు జన్మించినట్లు చెప్పబడింది. సంవాదములో వేదాంత విషయాలు చొప్పించబడ్డాయి. శ్రీనాథుని కథను పోలియున్నది. ఈ కవి కాలం తెలియరాదు.

సిరియాళ కథను నాటకంగా జ్యోతికోట దాసు "సిరియాళ మహారాజా నాటకం" పేరుతో రచించాడు. తాఖ్నూరు (బళ్ళారి) నివాసి. క్రీ.శ. 1908 లో గ్రంథము ముద్రింపబడింది. గ్రంథ రచన ప్లవమాఘమని పేర్కొన్నాడు. క్రీ.శ. 1902 సంవత్సరము కావచ్చునని ఆచార్య ఎస్. వి. జోగారావుగా రభిప్రాయం.

ఈ కథలో ప్రసిద్ధ రాగతాళాలు, దరువులు, ద్విపదలు, పద్యాలు, ఏలలు మొదలగునవి ఉన్నాయి. సంధివచనాలు తరచుగా కనిపిస్తాయి. కానీ సంవాద వచనాలు లేవు. చోపుదార పాత్ర ఉంది. రచన పామర, జనాభిరుచికి తగినట్లుంది జ్యోతిదాసేగాక బేతపూడి పరబ్రహ్మకవి కూడా శ్రీయాల (సిరియాళ) పేరుతో ఒకనాటకాన్ని రచించాడు. ఈ నాటకాన్ని ప్రచురించిన వారు రంగా వేంకటరత్నం (బెజవాడ) సంవత్సరం తెలియదు. భటుని హిందీ ప్రసంగాలు, పాత్రల తెర ద్విపదలు, వచన ప్రసంగాలు, మధ్య మధ్యలో సూత్రధారుడు పాత్రలతో సంభాషించడం ఉంది. రచన సరసమైంది. ఆధునికతా ముద్ర గలది.

సిరియాళ జంగం కథగా కూడా ఉంది. జంగంకథలనే తందానకథలు, దక్కి కథలు, మరాఠీ కథలు, తంబూరకథలు అంటారు. గంజినాగదాసు సిరియాళ మహారాజు చరిత్ర పేరుతో జంగకథగా రచించారు. ఇందు సిరియాలుని భార్య దేవమణిగా చెప్పబడింది. వీరు సంతానానికి కాశీకి పోయి విశ్వనాధున్ని గూర్చి తపస్సు చేయగా శివునివరంచే సిరాలుడనే కొడుకు జన్మించినట్లు చెప్పబడింది. శివయోగి బాలున్ని పిలవమని కోరగా "ఉండే ఒక్క కుమారుని చంపించి భిక్షం తీసుకున్నారు." అని కపటమునితో పల్కగా శివుడు వారి భక్తికి మెచ్చి వరంకోరుకోమనగా దేవమణి పుత్ర భిక్షను కోరుతుంది. అప్పుడు కైలాసం నుండి పుత్రుని శివుడు రప్పించినట్లు, తర్వాత ముగ్గురు విమానంలో కైలాసం వెళ్ళినట్లు ఈ జంగం కథలో చెప్పబడింది. ఇది మిగిలిన కథలకంటె భిన్నమైంది. జానపదుల్లో ప్రచారంలో పదంగా కూడా సిరియాళ కథ ఉంది. అప్పలనరసింహదాసు శ్రీయాళ చరిత్ర పేరుతో శ్రీరామునికి అంకితముగా ఈ పదాన్ని ..24 లో వ్రాసినారు. జంగంకథను పోలివుంది.

సిరియాళ కథ జానపదులలో బాగా వ్యాప్తి చెంది ఉంది. స్త్రీల పౌరాణిక పాటలలో చిరుతొండరాజు చరిత్ర ఉంది.

"పాపపు గర్భాన జన్మించుక తన
బాల్యమందున చావు నీకిచ్చె బ్రహ్మ"

అని తల్లి కొడుకును చూసి విలపించినట్లు కలదు. బాలుడు బ్రతికి రాగా కథ సుఖాంత మవుతుంది. ఆచార్య ఎస్. గంగప్పగారు, ఆచార్య నాయని కృష్ణకుమారి గారు సిరియాళ కథను జన పదాలనుండి సేకరించారు. ఆచార్య నాయని కృష్ణకుమారి గారు 'తెలుగు జానపద గేయ గాథలు' అనే గ్రంథంలో ఉటంకించిన సిరియాలుని కథ భాగాన్ని పరికించండి :-

"చుట్టూర కూరల్లు నడుమ నన్నాము
భోంచేతుర్ రండయ్య శివభక్తులారా :
నరమాంసలేంది భోంచేయమనిరి
ఆదేటి బాలుణ్ణి అటు బిలిచినారూ
పాలుబోసి ఒక కత్తి పాకంగ నూరి
చిన్న చిన్న వెంకలు చిన్నటిక కేసి
పెద్ద పెద్ద వెంకలు పెద్దటిక కేసి
నెయిబోసి ఒక కుండ నేటంగ వండె
చుట్టూర కూరల్లు నడుమనన్నమ్ము

భోంచేతు రాండయ్య శివభక్తులారా-" ఇలా సాగుతుంది కథ. (పుట. 408) పాల్కురికి కాలంనాటికే వ్యాప్తిలోనున్న జానపద గేయ కథ నేటికీ పలుమార్పులతో వ్యాప్తిలో ఉంది. ఈ వ్యాస కర్త కూడా ఒక జానపద కథ గేయన్ని సేకరించాడు. ఆ గేయంలో ఎవరి పేర్లు లేకుండానే సాగుతుంది. నాట్ల పాటగా సాగే గేయం ఎంత సహజ సుందరంగా, మనోజ్ఞంగా ఉందో చూడండి.

జ న ప ద క థా గే యి ము :

సిరియాళ కథ - (జానపదుల నాట్లు పాట)

పేదింటి పుయ్యేట ఓ జంగమయ్యా

మా ఇంట శివపూజ చేసి పోవయ్యా
రామనా ఉయ్యాలలో ! శ్రీరామ నా ఉయ్యాలలో ! ॥పిదింటి॥
జంగమయ్యకు ఆతిధ్యం —
శికాయ పరకలతో చితికెల్ల దోచె
రామనా ఉయ్యాలలో ! శ్రీ రామనా ఉయ్యాలలో !
శికాయ పరకలతో చితికెల్ల దోసె
బంగారు పరకలతో బయలెల్ల దోసె ॥రామనా॥
బంగారు పరకలతో బయలెల్ల దోచె
కంచు కుండల కడిగి తలయెసురు బోచె ॥రామనా॥
కంచు కుండల కడిగి తలయెసురు బోచె
వాలకుండల కడిగి వయిమూత లేసె
పాలకుండల కడిగి వయిమూత లేసె ॥రామనా॥
పొడి పొడి చెక్కలతో పోవులు రగలేచ ॥రామనా॥
పొడి పొడి చెక్కలతో పోవులు రగలేచ
సన్నంపు వరి బియ్యం సరియెసట వేసె ॥రామనా॥
సన్నంపు వరి బియ్యం సరియెసట వేసె
గంధంపు చెక్కలతో గజమంట లేసె ॥రామనా॥
గంధంపు చెక్కలతో గజమంట లేసె
గవ్వన్న వండేసె గువ్వన్న పొంగే ॥రామనా॥
మేలంటి గరిచేసి మెతుకంటి జూచె
మేలంటి గరిచేసి మెతుకంటి జూచె
జాలారి నిబ్బేసి జల్లెన్న వంచె
జాలారి నిబ్బేసి జల్లెన్న వంచె
సారపప్పులేసి కూరలే చేసె। ॥రామనా॥
సారపప్పులేసి కూరలే చేసె
రావయ్యా! జంగమ బోంచేద్దువానె! ॥రామనా॥

జంబియాకులెదెచ్చి విస్తర్లె కుట్టె
రావయ్యా జంగమ బోంచేద్దువానె ॥రామనా॥

జంగమయ్య బాలున్ని చంపి మాంసంవండి పెట్టమనుట,
బాలున్ని చంపి వండుట —

రావయ్యా జంగమా బోంచేద్దు వానె
బాల కూరలు లేందె తిన్నే భోజనము
రామనావుయ్యాలలో॥ శ్రీ రామనావుయ్యాలలో
బాల కూరలు లేందె తిన్నే భోజనము
ఆడేటి బాలున్ని అంచునకు బిలిచె॥ ॥రామనా॥

ఆడేటి బాలున్ని అంచునకు బిలిచె
గజ్జల్ల కొడవలితో గల్లున్న నరికె॥ ॥రామనా॥

గజ్జల్ల కొడవలితో గల్లున్న నరికె
శిరసు కాళ్ళుదీసి గాట్లోన బెట్టె
శిరసు కాళ్ళుదీసి గాట్లోన బెట్టె
చిన చిన కత్తులతో చిన్నవిగ దరిగె! ॥రామనా॥

చిన చిన కత్తులతో చిన్నవిగ తరిగె
ఘర్మమసలపెట్టి ఘుమ్మన వండె
ఘర్మమసలపెట్టి ఘుమ్మన వండె
రావయ్య జంగమ భోంచేతువానె॥ ॥రామనా॥

జంగమయ్య - శిరసు కూర లేనిదె తిననను
రావయ్య జంగమ భోంచేతువానే
శిరసు కూర లేందె తిన్ను భోజనము ॥రామనా॥

శిరసు కూర లేందె తిన్ను భోజనము
గాట్లోటి తలకాయ రోట్లోన బెట్టె ॥రామనా॥

గాల్లోటి తలకాయ రోట్లోన బెట్టి
గజ్జెల్లో రోకలితో గజ గజ దంచె ॥రామనా॥
గజ్జెల్లో రోకలితో గజ బిజిగ దంచె
చిన చిన కత్తులతో చిన్నవిగ దరిగె! ॥రామనా॥
చిన చిన కత్తులతో చిన్నవిగ దరిగె
ఘర్మ మసలు బెట్టి ఘుమ్మన వండె
ఘర్మ మసలు బెట్టి ఘుమ్మన వండె
రావయ్య జంగిమా భోంచేయవానె ॥రామనా॥

బాలుడు లేనింట భోజనం చేయననుట -

రావయ్య జంగమా! భోంజేతువానె
బాలపొత్తు లేందే తినను భోజనము ॥రామనా॥
బాల పొత్తు లేందె తినను భోజనము
నాకున్న బాలున్ని నీకొండి బెడితి ॥రామనా॥
నాకున్న బాలున్ని నీకొండి బెడితి
నికలేని బాలున్ని నేనేడ దెత్తు ॥రామనా॥

పేరెత్తి పిలిస్తే బాలుడు బ్రతికి వచ్చుట, జంగమయ్య వైకుంఠమిచ్చుట -

నిక లేని బాలున్ని నేనేడ దెత్తు
వీథిలోకి పోయి పేరెత్తి పిలువు! ॥రామనా॥
వీథిలోకి పోయి పేరెత్తి పిలువు!
వీథిలోనికి పోయి పేరెత్తి పిలుచే! ॥రామనా॥
వీథిలోకి పోయి పేరెత్తి పిల్వగా
గజ్జెల్తో, మువ్వల్తో ఆడుతూ వచ్చె
గజ్జెల్తో, మువ్వల్తో ఆడుతూ వచ్చె
మెచ్చితిని ఓకాంత యిచ్చితిని వైకుంఠం! ॥రామనా॥
మెచ్చితిని ఓకాంత యిస్తి వైకుంఠం
అంతలో జంగమ మాయమైపోయె ॥రామనా॥

[పాడినది కాలాపల్లి ఎల్లమ్మ (40) దిగపూడు హరిజన వాడ, పీలేరు, చిత్తూరు జిల్లా (తేది 26.4.82)

సేకరణకు సహకరించిన వారు: మిత్రులు టి. రాజా రెడ్డి
సేకరణ: డాక్టర్ ఇ. బాలక్రిష్ణా రెడ్డి]

ఈ విధంగా శైవ భక్తి భావం మూర్తీభవించిన సిరియాళ కథ వివిధ సాహిత్య ప్రక్రియల్లోను, జానపద గేయ రూపములోను ద్రావిడ భాషలైన తమిళాంధ్ర సాహిత్యాలలో బహుళ ప్రచారంలో ఉంది.

## పరిశీలించిన గ్రంథాలు


1. తమిళవిందు — చల్లా రాధాకృష్ణ శర్మ
   మధురై కామరాజ్ విశ్వవిద్యాలయం
   మధురై (1986)

2. తమిళ సాహిత్య చరిత్ర — చల్లా రాధాకృష్ణ శర్మ
   ఆం. ప్ర. సాహిత్య అకాడమి,
   హైదరాబాదు (1976)

3. తమిళాంధ్ర శైవ వాఙ్మయములు (వ్యాసం)
   ఆచార్య జి. నాగయ్య

4. తెలుగులో సిరియాళ చరిత్ర — డా॥ టి. దామోదరం,
   ఎస్. వి. ప్రింటర్స్, మదనపల్లె (1989)

5. తెలుగు జానపద గేయ గాథలు — డా॥ నాయని కృష్ణకుమారి
   ఆంధ్ర సారస్వత పరిషత్,
   హైదరాబాదు (1977)

# తెలుగు - కన్నడ
# జానపద పారమార్థిక గేయాలు సరూపత

జానపదులు అలవోకగా, అప్రయత్నంగా పాడుకునే పాటలు జానపద గేయాలు. వీటికే పల్లెపాటలని, పాతపాటలని పేర్లు. ఇవి కథారహితా లని, కథాసహితాలని రెండు రకాలు. వీటిని లౌకిక గేయాలని, అలౌకిక గేయాలని రెండుగా విడగొట్టవచ్చు. ఐహిక జీవనానికి, ఆలోచనలకు సంబంధించినవి లౌకిక గేయాలు. ఉత్కృష్టమైన పరలోకం ఒకటి ఉందని నమ్మి, పరలోకంపై ఇహలోక మానవులకు ఉండే ఆలోచనలను, అభిప్రాయాలను, అనుభూతులను వెల్లడించేవి అలౌకిక గేయాలు. వీటికే పారమార్థిక గేయాలని పేరు. తెలుగు కన్నడ కథారహిత జానపద పారమార్థిక గేయాలలో కనిపించే సరూపతను నిరూపించడం ఈ వ్యాసోద్దేశం.

ఆదిమ మానవుడు తన మనోభావాల్ని ఎదుటివారితో చెప్పడం ఎప్పుడైతే నేర్చుకున్నాడో అప్పటినుండి భాష, భాషతోపాటు కవిత్వం పుట్టింది. ప్రాచీన మానవుడు ప్రకృతి వైచిత్ర్యాలకు ముగ్ధుడై ఊహాకందని వాటిని మానవాతీత శక్తులుగా భావించి ఆరాధించ సాగినాడు. అప్పుడు గీతం ప్రధాన స్థానమాక్రమించేది. ఆ గీతాలే పారమార్థిక గేయాలు. ఇవి ప్రకృతి చర్యలకు ప్రతిస్పందనగా పుట్టినవి.

కథారహిత పారమార్థిక గేయాలను వస్తుతత్త్వాన్ని బట్టి, ఆలంబనను బట్టి ఈ వ్యాసకర్త 'తెలుగు పారమార్థిక గేయ సాహిత్యం' అనే గ్రంథంలో తొమ్మిది వర్గాలుగా వర్గీకరించినాడు. 1. [illegible] వైరాగ్య యోగ గీతాలు 2. భక్తి

బోధక కీర్తనలు 3. ఆధ్యాత్మిక తత్త్వాలు 4. వైరాగ్య వచనాలు 5. యోగ తత్త్వాలు 6 మార్మిక తత్త్వాలు 7. కాలజ్ఞాన తత్త్వాలు 8. ప్రబోధాత్మక తత్త్వాలు 9. సంస్కరణ తత్త్వాలు. వీటిలో మరలా అంతర్భాగాలున్నాయి.[1] కన్నడంలో కూడా ఇంచుమించు తెలుగులో గల విభాగాలున్నాయి. వాటిలో కొన్ని భావంలోను, వస్తువులోను, లయలోను సారూప్యత కలిగి యున్నాయి.

ఏ భాషలో అయినా కావ్య సాహిత్యానికి ముందే జానపద సాహిత్య ముంటుంది. కన్నడాంధ్ర సాహిత్యాలలో కావ్య రచనకు ముందున్నదంతా జానపద సాహిత్యమే. పాల్కురికి సోమనాథుడు (క్రీ. శ. 1160-1240) తన కాలం నాటికే తెలుగు ప్రజానీకం తుమ్మెద, ప్రభాత, పర్వత, శంకర, నివాళి, గొబ్బి పదాలు, వెన్నెల పదములు పాడుచు ఆడేవారని తెల్పి యున్నాడు.[2] కన్నడంలో కూడా క్రీ. శ. 8 వ శతాబ్దం నాటి బాదామి శాసనంలో జానపద ఛందస్సయిన త్రిపది ఉండటం వల్ల, క్రీ. శ. 9 వ శతాబ్దికి చెందిన మరొక శాసనంలో రోకటి పాట ప్రస్తావన ఉండటం వల్ల అతి ప్రాచీన కాలంనుండే జానపద సాహిత్యం ప్రచారంలో ఉండేదని స్పష్టమౌచున్నది.

"ప్రపంచంలో యే భాషకు చెందినవైనా యీ జానపద గేయాల వెనుక దాగియున్న హృదయం ఒక్కటే. తెలుగు గేయాలైనా, కన్నడ గేయాలైనా వాటిలో సౌందర్యం ఒక్కటే."[3] ప్రాచీన మానవుని అత్యంత సహజమైన చిత్తవృత్తిని పారమార్థిక గేయాలు ప్రతిబింబిస్తాయి.

## సరూపత గల పారమార్థిక గేయాలు

### 1. వా న పా ట లు

తెలుగు, కన్నడ జానపదులు వర్షంకోసం వానదేవున్ని పలు రకాలుగా కీర్తించే పాటలున్నాయి. రైతుకు బంగారు పంట పండాలంటే వాన కురవాలి గదా ! వేదాలలో సైతం వరుణదేవున్ని ప్రార్థించే మంత్రాలున్నాయి. మేఘ దేవత పర్జన్యుడు. ఈతని రథం నీటిబండి. తెలుగు జానపదులు వానదేమున్ని -

" మొఱ్ఱో మొఱ్ఱో వానదేవుడా !
మొఱ్ఱో మొఱ్ఱో వానదేవుడా !

మమ్మింక దయచూడుమయ్యా" — అంటూ ప్రార్థిస్తారు.

మేఘాలు కనిపించగానే —

"కారు మేఘమా ! రావే, రావే

పువ్వుల మబ్బా దిగవే, దిగవే ॥కా॥

పింజి మేఘమా దూళి మేఘమా

చెమటను ఊడ్చి దిమ్మరింపవే ॥కా॥" అంటూ వేడుకుంటారు. వాన కురవకపోతే కప్పను ఊరేగిస్తారు. అలా చేస్తే వర్షం వస్తుందని జానపదుల నమ్మకం. ఆ సమయంలో —

"వానదేవుడా ! వానదేవుడా

వానల్లు కురిపించు వానదేవుడా ॥వా॥

— — — —

జడివాన కురవాలి

సాగాలి కాలువలు

చెరువులన్నీ నిండాలి

చేలన్ని పండాలి"4 — అంటూ వానదేవున్ని ప్రార్థిస్తారు.

కన్నడంలో జానపదులు, ముఖ్యంగా రైతులు మళెరాజా (వానరాజా)ని వర్షంకోసం ప్రార్థించే గేయాలున్నాయి. తెలుగువారు కప్పలమ్మను పూజించి ఊరేగించినట్లే వానకోసం కన్నడీకులు 'కరగ' ఉత్సవం చేస్తారు. ఒక కొత్త కుండకు పూలుచుట్టి, ఒక బాలుని తలపైపెట్టి ఇల్లిల్లూ తిరుగుతూ మళెరాజాను (వానరాజాను) ఇలా ప్రార్థిస్తారు.

"హుయ్యో హుయ్యో మళెరాయ

హూవిన తోటకె నీరిల్ల

బెచ్చో బెచ్చో మళెరాయ

సౌతెయ తోటకె నీరిల్ల

కుట్టో కుట్టో మళెరాయ

కుంబళ తోటకె నీరిల్ల" 5

(ఓ వానదేవుడా ! పూలతోటకు నీరులేదు. దోసతోటకు నీరులేదు. గుమ్మడి తోటకు అసలే నీరు లేదు. కురవయ్యా ! వానదేవుడా !") అని కీర్తిస్తారు. ఇంకా ఓ జానపదుడు -

"స్వాతీయమళెబంధు మళెరాజ
సుత్తదేశకె ఆగ్యాదె మళెరాజ
హళ్ళ కొళ్ళ హెణహరిదాడి హోదావు
యాలాగ బంద్యప్ప మళెరాజ" 6

(చుట్టూ అన్ని దేశాలలో వాన కురిసింది. ఇంత ఆలస్యంగా వచ్చావేమిటయ్యా ! అంటూ అడుగుతున్నాడు వానరాజుని )

ఈ వానపాటల్లో తెలుగు పాటల్లోని లయ కనిపిస్తుంది. ఈ పాటలు

"వానల్లు కురవాలి వానదేముడా !

వరిచేలు పండాలి వానదేముడా !" — అనే పాటని తలపిస్తుంది. కన్నడ జానపదులు వానదేవుని గుర్రాలు తాము పండించే రాగుల రంగున్నాయంటూ బంతి పాటలో పాడుకోవడం కద్దు.

## 2. ఏ రు వా క పా ట లు

జానపదులు ఏ పని చేసినా అందులో భక్తిభావం యిమిడి ఉంటుంది. తెలుగువారికి, కన్నడికులకు వ్యవసాయం ప్రధాన జీవనోపాధి. జానపదులు ఏరువాకతో వ్యవసాయం పనులు ప్రారంభిస్తారు. ఏరువాక అనగా నాగలిని, ఎడ్లను పూజించి తొలిదుక్కిని ప్రారంభించుట. నాగలికి ఎడ్లను కట్టి పసుపు, కుంకుమలతో పూజించి పూలు, పత్రిదండలు వేస్తారు. ధూపదీపము లిస్తారు.

"మంగళమమ్మా మా పూజలు గైకొమ్మా
మంగళమమ్మా మా నాగలి నీకు ॥మా॥
కష్టమునకు భూమిదున్ని కరువుమాపి కడుపునింపి
సకల జీవరాసిని చాలుగ పోషింతువమ్మా ॥మం॥
కర్షకులను కరుణతోడ కాపాడుచు యెల్లపుడు
కామితార్థముల నిచ్చెడి, కల్పవల్లివమ్మ నీకు7 ॥మం॥"

అంటూ పాటలు పాడుతారు. ఇంకా —

"ఏరువాకమ్మకు ఏమి కావాలి

ఎర్ర ఎర్రని పూలమాల కావాలి" — అంటూ ఏరువాక ఆరాధన గేయాన్ని కూడా ఆలపిస్తారు. ఇలా చేస్తే పంటలు సమృద్ధిగా పండుతాయని జానపదుల నమ్మకం.

కన్నడ జానపదులు కూడా భక్తితో 'భూతాయి'ని (భూదేవిని) తలుచుకుంటారు. భూమాత చల్లగా చూడాలని కోరుకుంటారు. పూజచేసి, విత్తనాలు విత్తితే చక్కగా వాన కురిసి పైరు పచ్చగా కళకళలాడుతుందని కర్షకుల విశ్వాసం. అందుకనే ప్రారంభంలో విత్తనం వేసేటప్పుడు -

"అడవి పూ జెయమాడి, ఎడెమాడి కూరిగె
ఒడియె గొల్లాళ బిత్తరదె: మళెయాగి
కడెరాశి తుంబికై సోతు"8

అని గానం చేస్తూ తెలుగువారు నాగలిని, ఎడ్లను పూజించినట్లే కన్నడీకులు భూదేవికి కులదేవతలకు పూజాపునస్కారాలు చేస్తారు. అలా చేస్తే ధాన్యం సమృద్ధిగా పండుతుందని భావిస్తారు.

3. గ ణ ప తి భ క్తి

తెలుగులో వలె కన్నడంలో కూడా గణపతికి సంబంధించిన భక్తి గీతాలు అనేకం కనిపిస్తాయి వినాయకుడు గణాధిపతి కాబట్టి గణపతిగా పేరు పొందినాడు. ఏ నూతన కార్యమైనా వినాయక పూజలో చేయడం అనాది నుండి వస్తున్న ఆచారం. కోలాటపాటలుసైతం ప్రథమంగా గణపతి స్తుతితో ప్రారంభిస్తారు. సర్వవిఘ్నాలను శాంతింపచేసే ఆ గణనాథుడు విద్యకు కూడా అధినాయకుడు - అందుకే గణపతిపై జానపద గేయాలు అనేకం వ్యాప్తిలో ఉన్నాయి. మచ్చునకు ఒకటి -

"శ్రీ గణాధిప శివకుమారా। నాగభూషణ ప్రోవరా।
సాగి నేనీ పాదంబులకు సాష్టాంగ మొప్పగ జేతురా।
కార్యముల నెరవేర్చు ఘనుడ నీవని నే వింటిరా।
ఆర్యులకు నీనమ్మకం బరచేతి ఉసిరిక పండురా ॥శ్రీ॥"9

అంటూ కీర్తిస్తారు. వరసిద్ధి వినాయకుని పూజిస్తారు.

కన్నడీకులు కూడా గణపతిని విద్యాధిపతిగా, గణాధిదేవతగా పూజించి కీర్తిస్తారు. కన్నడంలో వ్యాప్తిలోగల పాటలలో ఒకటి -

"శరణు శరణువయ్య గణనాయ్క
నమ్మకరుణ దిందలి కాయొ గణనాయ్క
ఎళ్ళుండెజేను తుప్ప గణనాయ్క
నమగె విద్యావ కలిసయ్య గణనాయ్క
ఉద్దుహోళిగె తుప్ప గణనాయ్క
గొనెమేగ్ల బాళెహణ్ణు గణనాయ్క"10

అంటూ కీర్తిస్తారు. ఈ పాటలయ కూడా తెలుగు పాటలాగే ఉంది.

4. స ర స్వ తి స్తు తి

చదువుల తల్లియైన సరస్వతీదేవిని అన్ని విద్యలిమ్మని వేడుకుంటారు. సరస్వతీదేవికి శారదాంబయని, భారతీ దేవియని పేర్లు. ఆదేవిని-

"శ్రీ భారతీదేవి చేకొనవమ్మ
ప్రాపు మా కయి యుండి పాలించవమ్మ ॥శ్రీ॥
చాల విద్యలు మాకు సమకూర్చవమ్మా
కర్పూర హారతిదె గైకొనవమ్మా ॥శ్రీ॥"11

అని ప్రార్థించి, హారతులిస్తారు.

కన్నడ జానపదులు కూడా సరస్వతిని స్తుతిస్తారు. కళారాధకులు, కళాకారులు ఆ దేవిని కీర్తిస్తారు. వాకిట నిలవకు, లోనికి రమ్మని, అరటిపండు ఆరగించమని సరస్వతీ దేవిని పిలిచే పాట.

"అక్క సరసోతి ఆదిబ్రహ్మనమడది
బాళేయ హణ్ణు ఒళలంచ హొరలంచ
బాగూరు బెనవ కొడుమతియ"12

అంటూ పిలుస్తూ పూజించే పాటలున్నాయి.

5. శై వ భ క్తి గే యా లు

శివుడు శుభంకరుడు. శివుడు అధిదేవతగాగల మతం శైవమతం,

'నమశ్శివాయ' అన్నది శివపంచాక్షరి మంత్రం. శివుడు భక్తసులభుడని ప్రతీతి. శైవులు -

"నమశ్శివాయనవే వో మనసా!
నామము మరువకుమీ
నీనామముతో నిత్యం, స్వామిని తలంచితె
కామితార్థములిచ్చు నిత్యం భువిలో వో మనస ॥నమ॥"[13]

అంటూ శివపంచాక్షరి మహిమను గానం చేస్తారు.

"హరహర మహదేవ శంకరా! నన్నాదుకోరా పార్వతీశ్వరా!
నిరతము నిను వేడుచుంటిరా! నేనీ చరణంబులే నమ్మియుంటిరా!"[14]
॥హరహర॥

అంటూ వేడుకుంటారు.

"దేవులకెల్లను దేవగు పార్వతిదేవి తల్లి మాకు
కావున మాహేశ్వరుడగు రుద్రుడు కన్నతల్లి మాకు"

అంటూ జగత్తుకు పితరులైన శివపార్వతులను పూజించి తరిస్తారు.

శివ పార్వతులనేగాక శివుని వాహనమైన నందీశ్వరుని కూడా జానపదులు భక్తితో కొలుస్తారు. ఈయనకే బసవన్న అని పేరు. ప్రతి శివాలయంలో శివుడు యెదుట నందీశ్వరుని చూడవచ్చు. బసవని విశ్వరూపాన్ని జానపదులు -

"బసవ నీరూపంబు అసమాక్షుడె యెరుగు
పశు మానవులకు సంభవమెట్లు బసవా!
వేదములు పాదములు, విశ్వమంతయు మేను
ఆదిమూలమునాభి అమరులె రోమములు
మీది పరతత్వంబు మేలైన పురము నాదము
శ్వాసంబు నాలుకయు స్మృతులూ
గౌరిజ లెనిమిది దిక్కులు రగాధిపతిలోక

వరుస పిము బొగడ నెవ్వరికైన వశమా!" ॥బసవ॥[15]

అని బసవని విశ్వరూపాన్ని వర్ణించి పూజిస్తారు.

కన్నడంలో కూడా అసంఖ్యాకమైన శైవభక్తి గేయాలున్నాయి. శ్రీశైలం మల్లన్న తెలుగు దేశంలో ఉన్నా, కన్నడ శైవులకు ఆరాధ్యదేవత. సుఖసంతోషాలతో మునిగి ఉన్నా, కష్టనష్టాలల్లో ఉన్నా "ఎలెమనవె శివ నెంబళ బుదబిడబేడ" (ఓ మనసా! శివుడనే శబ్దాన్ని వదలవద్దు) అంటూ మనసుకు హితవు పలుకుతారు. శివునాజ్ఞలేనిదే చీమైనా కుట్టదనే బలమైన నమ్మకం జానపదులకుంది. అందుకే దేవుణ్ణి స్తుతిస్తారు, పూజిస్తారు. ఆపస రాలలో ఆపదలలో ఆదుకొనే దేవుడు శివుడు. కన్నడికులు మల్లయ్య తండ్రీ నా చేయి వదలవద్దు అంటూ పాడుకొనే గేయం చూడండి.

"మంది మందీ యెందుమంది నంబలి హోద
మంది బిట్టారనదు పీర! మల్లయ్య
తంది ననకైయ బిడక్యాడ"[16]

అంటూ శివుని కీర్తిస్తారు. ఈ విధమైన గేయాలనేకం కన్నడ జానపద సాహిత్యంలో ఉన్నాయి.

కన్నడికులు శివుని వాహనమైన బసవన్నను అవతార పురుషుడుగా కీర్తిస్తారు. "వీరశైవ మత ప్రతిష్ఠాపకుడైన బసవన్న పుట్టిన తర్వాత శివుని వాహనమైన బసవన్న ప్రతిష్ఠ పెరిగింది"[17] అని డాక్టర్ ఆర్వీయస్ సుందరం గారి మాటలు యథార్థములు.

కర్షకులకు అన్నప్రదాత, శివుని వాహనమైన బసవన్న రైతులకు ప్రీతి పాత్రుడు. బసవన్నను 'ఎద్దు' అనడం తగదని జానపదుల అభిప్రాయం.

"ఎత్తు ఎనబహుదె ఎడచోరి బసవన
సత్తేళు లోక సలహాన బసవన
సత్యమరెయువుదె ధరెయిల్లి"[18]

అంటూ బసవన్ని కీర్తిస్తారు. ఈ పాటలేగాక వీరభద్రుడు మొదలైన వారిపై కూడా కన్నడంలో పాటలున్నాయి. వీరశైవ మత ప్రభావంచే అనేక పాటలు వ్యాప్తియందున్నాయి.

## 6. విష్ణు భక్తి గేయాలు

తెలుగు జానపదగేయ సాహిత్యంలో విష్ణువు అవతారాలైన శ్రీరామ, శ్రీకృష్ణ అవతారాలపై పెక్కు గేయాలున్నాయి. 'అంతా రామమయం ఈజగమంతా రామమయం' అంటూ శ్రీరాముని కీర్తిస్తారు. కృష్ణలీలలు వర్ణించే గేయాలు, మధురభక్తి కీర్తనలు లెక్కకు మిక్కుటంగా ఉన్నాయి. అదే విధంగా కలియుగ ప్రత్యక్ష దైవం, మహావిష్ణువు అవతారం, శ్రీ వేంకటేశ్వర స్వామి ఆ స్వామి ఆపద మ్రొక్కులవాడుగా ప్రసిద్ధి. ఆ వెంకన్నపై అనేక గేయాలు వ్యాప్తిలో ఉన్నాయి. నీవే దిక్కు రక్షింపమని వేడు కీర్తన ఒకటి—

"వేరేగతి లేదు వేరే గతిలేదు
వేరే గతిలేదురా వేంకటేశా! ॥వేరే॥
సారసాక్ష నీదు చరణములు తప్ప
వేరు సాయముగానర వేంకటేశ ॥వేరే॥
పతితుడనేనని పావనమూర్తివని
బతిమాలెద నన్ను బ్రోవరా వేంకటేశా"19 ॥వేరే॥

భక్తి పరాయణుడైన ఆ స్వామిని శరణాగతిపొందితే తప్పక రక్షిస్తాడనే నమ్మకం జానపదులకుంది.

కన్నడ జానపదగేయ సాహిత్యంలో తెలుగులో కన్న వైష్ణవ కీర్తనలు తక్కువనే చెప్పాలి. కన్నడికులకు కూడా వెంకటేశ్వర స్వామి ఇష్టదైవం. వారు తిరుమలేశుని, తిరుమలప్ప, తిమ్మప్ప అని పిలుస్తారు. ఆ స్వామి ఐశ్వర్యాన్ని కొనియాడే కీర్తనలున్నాయి. గోవిందా! వెంకట రమణా! తిమ్మప్పా! మము ఓడించకు, గెలిపించు అని పాడుకునే పాట ఒకటి చూడండి—

"వెంకట రమణానె ఎశెయ గోవిందానె
భకుతరి గొలియొ సుగుణానె! తిమ్మయ్య

సోలి సబేద గెలిసమ్మ"[20]—అని ప్రార్థిస్తారు. వెంకన్న పైననేగాక శ్రీరామ, శ్రీకృష్ణ అవతారాలపై కీర్తనలున్నాయి.

పండరిపురిలో వెలసిన పండరినాథునిపై భజన పాటలు అనేకం ఆంధ్ర దేశంలో వ్యాప్తిలో ఉన్నాయి. భజనలలో 'పండరి భజన' ప్రత్యేకతను సంత రించుకుంది. ఆ పాండురంగని—

"రంగ రారా ! పండరినాథ రారా !

రంగని భక్తుల మొరాలకించ వేగ రారా ॥రంగ॥"—అని పిలుస్తారు. సర్వం ఆ రంగనాథుడే అని భావించి—

"పండరినాథ భక్త వినోదా !

దండము దండము దయగొను స్వామీ !

యిల్లు వాకిలి నీవే యిష్టులు నీవే !

తల్లి దండ్రి గురు దైవము నీవే ॥పండరి॥"[21] — అని స్తుతిస్తారు. భజిస్తారు.

కన్నడికులు పండరినాథుని ముగ్ధమోహనరూపాన్ని ఇలా కీర్తిస్తారు.

"ఇట్టిగి కల్లమ్యాల ఊరి నింతా నెరడు పాద
జర మందీల శాల ! ఇళియ బిట్టార చోల
నాద బ్రహ్మ మేఘ శామ సృష్టికర్త సర్వ గోమ
సాదు సంతర ప్రేమ,
హ్యాంగ నింతా రెనగ పేళిరే ! శ్రీ పాండురంగ

హ్యాంగ నింతా రెనగ పేళిరే"[22] — అంటూ ఆ స్వామి రూప గుణా దులను కీర్తిస్తారు.

(ఇటుక మీద నిలిచి, రెండు చేతులు నడుమ మీద పెట్టుకొని ముగ్ధ మోహనంగా కనిపిస్తుంటాడు. ఆ స్వామికి సాధువులపై అమితప్రేమ.)

మహావిష్ణువు స్థితి కారకుడు. భూలోకంలో ధర్మోద్ధరణకై అవత రించుట విష్ణువుకు పరిపాటి. శ్రీ మహావిష్ణువు మత్స్య, కూర్మాది దశావ

తారాలెత్తినట్లు ప్రతీతి. విష్ణువు వివిధ అవతారాలను, ప్రయోజనాలను వర్ణించే కీర్తనలు తెలుగులో పెక్కున్నాయి. "పేట్రాయు సామిదేవుడా!" అనేది చక్కని వల్లె పదం. అట్లే మరొకటి ఉదహరిస్తున్నాను—

"వలసి వేదము బ్రహ్మ కిచ్చిన మచ్చరూప నమోనమో!
కలయ వారుధి దరువ చేశిన కమఠ రూప నమోనమో
అలరు భూమి ధరింప జేసిన ఆదివరాహ నమోనమో
నాలుపుగా కంఠమున వెడలిన నారశింహ్మ నమోనమో!
వలసి బలిని మూడడుగులడిగిన వామనుండ నమోనమో!
బలిమి రాజుల నెల్ల ద్రుంచిన పరశురామ నమోనమో!
వలసి రావణ కుల మణంచిన హనుమ కులేశ నమోనమో!
బలపరాక్రమ విజయశ్రీ బలభద్ర రామ నమోనమో
పలుదెరంగుల (హితవు పల్కిన) బౌద్ధ రూప నమోనమో
కలియుగాంతమునందు రాగల కల్కిరూప నమోనమో
వెలయ తిరుమల కొండ వెలశిన వేంకటేశ నమోనమో"[23]

అవతారములందు ఏక వాక్యత లేదు. ఈ గేయంలో కృష్ణావతార ప్రసక్తిలేదు. కానీ తిరుమల వెంకటేశుని అవతారంగా పేర్కొన్నారు. అవతార ప్రయోజనాలని చక్కగా వివరించిన గేయమిది.

కన్నడంలో మహావిష్ణు అవతారాలను కీర్తించే పదవ పాట ఒకటి లభ్యమైంది దశావతారాలను కీర్తిస్తూ హరాంతత్తయ్య (హరాం అంటూ తొయ్యం దయ్య) అనే పల్లవిలో సాగిన పదవపాట—

"హరాంతత్తయ్య కద్గి ముత్తయ్య
కశిన్ చిక్కయ్య దోచి బత్తయ్య
సాగర శాయి రామయ్య హరాంతత్తయ్య
హత్తవతారద రామయ్య హరాంతత్తయ్య
దశరథ కంది రామయ్య హరాంతత్తయ్య
మత్స్యావతారద రామయ్య హరాంతత్తయ్య
హత్తతె కొండ రామయ్య హరాంతత్తయ్య"—24

ఇలా సాగుతుంది పాట ఇతడు రామభక్తుడు కాబోలు. శ్రీరాముని అవతారాలుగా కీర్తించాడు. ఈ విధంగా విష్ణు భక్తి కీర్తనలు తెలుగు-కన్నడ జానపద సాహిత్యాలలో ఉన్నట్లు తేలింది.

కన్నడంలో తెలుగులోలేని జవరాయ స్తుతి గేయం ఉంది. జవరాయ దంటే యముడు యముణ్ని అనేక రకాలగా స్తుతించే గేయాలు కన్నడంలో ఉన్నాయి. ఇటువంటివి తప్పితే భక్తి గేయాలు రెండింట సారూప్యత కలిగి యున్నాయి.

## 7. వ్రతాలు, నోముల పాటలు

కన్నడాంధ్ర దేశాలలో ఆచరింపబడే వ్రతాలు, నోములు పుష్కలంగా ఉన్నాయి. తెలుగునాట మహాశివరాత్రి వ్రతం, ఏకాదశి వ్రతం, సత్యనారాయణవ్రతం, వరలక్ష్మివ్రతం, గౌరీ వ్రతం, సూర్యచంద్రుల నోము; ఇత్యాది వ్రతాలు, నోములు నోస్తారు. ప్రతి వ్రతానికి ఒక పద్ధతి, ఉద్యాపనం, పాటలున్నాయి. జానపదులు ఎక్కువగా ఆచరించే వరలక్షి వ్రతం, గౌరీపూజ (నోము) పాటలు చూడండి. వరలక్ష్మి వ్రతం చేస్తూ వరలక్ష్మిని జానపదులు—

"లక్ష్మి రావే మా యింటికి
క్షీరాబ్ధి వరపుత్రి ॥లక్ష్మి॥
వరలక్ష్మి రావే మా యింటికి
లలితవై నెలకొన్న సూక్ష్మ దేహధారి
బృందావన విహారిణీ ॥లక్ష్మి॥
కుంకుమ పచ్చ కర్పూరం
అంకితముగ నలరు గంధం
అంచితముగ సాంబ్రాణి ధూపం
మాతా నీకు ప్రేమతో భక్తితో

సమర్పించెద మమ్మ ॥లక్ష్మి॥"— అని వరలక్ష్మిని పిలుస్తూ పాటలు పాడుతారు.

"మ్రొక్కెను నా పాలి శుక్రవారపు లక్ష్మి
ఒక్క చిత్తంబున హృదయమందు
చక్కగా కూర్చొని సౌభాగ్యములనొసగు
అక్కరకు రావమ్మ ఆదిలక్ష్మి"25 — అని పాడుతూ పూజిస్తారు. వ్రతం కథపట—

"హారతి గొను వరలక్ష్మి కర్పూర
హారతి గొను వరలక్ష్మి"—అంటూ హారతిచ్చి వ్రతం సమాప్తి చేస్తారు.

వరలక్ష్మి వ్రతం వలె గౌ. వ్రతం కూడా చేస్తారు. శక్తి రూపిణియైన పార్వతీదేవిని గౌరీదేవిగా పూజిస్తారు. గౌరీ నోము నోచుకుంటారు. గౌరీ నోము పాట సుదీర్ఘమైంది— ముగురమ్మలకు మూలమైన ఆ అమ్మను జానపదులు —

"శ్రీ గౌరి నీ మహిమ - గౌరమ్మా
చిత్రమై తోచెనమ్మా - గౌరమ్మా ॥శ్రీ॥
భారతీదేవి వీయ్యు
బ్రహ్మ కిల్లాలివై
పార్వతీ దేవివై
పరమేశు రాణివై
వరగ శ్రీలక్ష్మివయ్యూ - గౌరమ్మా
భార్య వైతి విహారికి ని ॥శ్రీ॥
ముక్కోటి దేవతలు
చక్కనీ కాంతలూ
పెక్కువగు నిను గూర్చి

పెక్కు నోములు నోమి

ఎక్కువ వారైరి - గౌరమ్మ ॥శ్రీ॥ — 26 ఇలాసాగుతుంది పాట. గౌరీ దేవిని పూజిస్తే సకల సంపదలు గలుగుతాయని నమ్ముతారు.

సస్యాభివృద్ధిని కోరువారు కేదార గౌరీవ్రతం చేస్తారు. ఆ సమయంలో-

"జొన్నల్ల పుట్టిన గౌరి జొన్నల్ల పెరిగిన గౌరి
అన్న వేసిన పొన్నల కింద నేను వేసిన నిమ్మల కింద
చల్లం గుండు సంపత్తి గౌరమ్మా"—అంటూ పాడి నైవేద్య మిస్తారు.

కన్నడ స్త్రీలకు కూడా గౌరీ పూజ ప్రీతి పాత్రమైంది. వారు మంగళ గౌరిని, సంపద్గౌరిని, గజ గౌరిని పూజిస్తారు. ఆ సమయంలో కన్నడ స్త్రీలు పాడే పాట—

"గౌరి గౌరి గాణా గౌరి మ్యాణా గౌరి
కళ్ళి గౌరి కుంకుమ గౌరి
అవరియంత అణ్ణనకోడ అణ్ణనకోడ
తాగరియంత తమ్మనకోడ తమ్మనకోడ"27

అంటూ స్తుతిస్తారు. ఇదేవిధంగా కన్నడ స్త్రీలు వరలక్ష్మీపూజకూడా చేస్తారు. "ఐదు శుక్రవారాల పాట" అనే పేరులో శుక్రవార వ్రతానికి సంబంధించి గీతాలు కన్నడ దేశంలో ప్రచారంలో ఉన్నాయి. శుక్రవారం వ్రతంలో శని వార వ్రతం కూడా చెస్తారు. వ్రతం ముగిసిన తర్వాత పాడే మంగళహారతి పాట—

"మంగళ జయవెన్ని మంగళ శుభవెన్ని
మంగళాంగనె మహాలకు మి
కంగళు తెరెదు కటాక్షదినోడలు
ఇంగోదు సకల పాపగళు
బరదు కరెయలి బంజెగె మక్కళాగలి
కురుడదె కంగళు బరలి

బరహరిచెయలి దారిద్ర్యగళెంగలి

శ్రీహరి నమ్మ హృదయదొళిరలి"[28] — అంటూ పాడి వరలక్ష్మీ వ్రత సమాప్తి చేస్తారు. వరలక్ష్మీ వ్రతం చేస్తే శుభపరంపర కలుగుతుందని, ఆమె కళ్ళు తెరచి చూస్తేనే సకల పాపాలు పోతాయని, వంధ్యస్త్రీకి బిడ్డలు కలుగుతారని, గ్రుడ్డివారికి చూపు వస్తుందని చెప్తారు. శ్రీహరి తమ హృదయాలలో నెలవాలని ఆశిస్తారు. ఈ విధంగా వ్రతాలకు, నోములకు సంబంధించిన పాటలలో తెలుగు, కన్నడ గేయాలకు సారూప్యత కనిపిస్తుంది.

## 9. నా గ పూ జ

ఉన్నత వర్ణాలవారు షోడశోపచార పూజచేస్తే జానపదులు, వృక్షపూజలు జంతుపూజలు చేస్తారు. మరచేళంలో రావి, మారేడు, వేప, జమ్మి మొదలైన వృక్షాలను పూజిస్తారు ఇంటింట తులసి పెట్టి పూజిస్తారు. గ్రామ దేవతలను రావి, వేప చెట్లక్రింద నిలిపి అర్చిస్తారు. ఈ వృక్షపూజలో ఆరోగ్య సూత్రాలు ఇమిడి ఉన్నాయని ఆర్యుల భావన. వృక్షపూజ లాగానే గోపూజ నాగపూజ చేస్తారు. గోవును దైవస్వరూపంగా, గోమాతగా భావిస్తారు. అదే విధంగా నాగపూజ చేస్తారు. తెలుగులో ప్రతి పూజకు పాటలున్నాయి.

జానపదులు భయభక్తులతో పూజించే నాగపూజ వెనుక ఆధ్యాత్మిక బోధ ఇమిడి ఉంది. సర్వరూపిణియైన కుండలినీ శక్తిని యోగశక్తిచే మేల్కొల్పి ఊర్ధ్వ చక్రము వరకు పోనిచ్చిన ముక్తి కలుగుతుందని హఠయోగ ప్రదీపికలో చెప్పబడింది ఆ ఉద్దేశంతోనే నాగారాధన ఏర్పడి ఉండవచ్చు.

తెలుగు - కన్నడ ప్రజలు భయభక్తులతో చేసే పూజలలో నాగపూజ ఒకటి. ప్రతి సంవత్సరం శ్రావణశుద్ధ పంచమిని నాగపంచమిగాను, చతుర్థిని నాగులచవితిగాను పేర్కొని పూజిస్తారు.

"ఏడాదికొకనాడు నాగాలచవితి

నాగాలచవితికి నేనొక్కపొద్దు

కాయ కర్పూరమే నీకు తెచ్చుండ

నూరూర నాగన్న పూజగొనిపోరా : ॥ఏడాది॥" — అని స్త్రీలు పాడుకుంటారు. ఇంకా ....

''నాగులచవితికి నాగన్న
స్నానసంధ్యలు నాగన్న
పూలు వడగల నాగన్న
మడిపట్టలతో నాగన్న
చిమ్మిడి చలిమిడి నాగన్న
పాలు వండ్లు నాగన్న
— — — —
ఉపవసించుచూ నాగన్నా
ఊరేగొస్తాం నాగన్నా
పుట్టకువస్తాం నాగన్నా

పూజలు గొనరా నాగన్నా''29 — అంటూ పాడుకుంటూ నైవేద్య మిస్తారు. కొందరు కులదేవతగా పూజిస్తారు. పై పాటలో నాగపూజ విధానం కూడా తెల్పబడింది.

కన్నడికులకు కూడా నాగపూజ ముఖ్యమైనదే. నాగులచవితికి పుట్టలో పాలుపోసి, పూజించే సాంప్రదాయం కన్నడ స్త్రీలలో కూడా ఉంది. ఆ సమయంలో —

"అక్కిట్టు తంబిట్టు, మాడిట్టి ఎప్పండి
దప్పరి కణహణెయవన కొరదాన
నాగ నినగెడెయొ కైముగిదొ''30 — ఇత్యాది పాటలు పాడు కుంటారు.

౪. ఎల్లమ్మ పాటలు

గ్రామదేవతలను పూజించడం, మొక్కుబడులు చెల్లించడం, జాతర్లు తిరునాళ్ళు చేయడం తెలుగు - కన్నడ జానపదులకు తెలుసు. తెలుగువారు గంగమ్మ, పోలేరమ్మ, చౌడమ్మ, ఎల్లమ్మ మొదలైన గ్రామదేవతలను పూజించి జాతర్లు చేస్తారు. ఆ సమయంలో ఆయా గ్రామదేవతల నుద్దేశించి పాడే పాటలనేకం ఉన్నాయి.

జమదగ్ని భార్యయైన రేణుకాదేవిని గ్రామీణులు ఎల్లమ్మని పిలుస్తారు ఈమె ఎల్లరకు అమ్మ. ఎల్లవారమ్మ - అనికూడా ప్రసిద్ధి. తమిళదేశంలో స్ఫోటకాధిదేవతగా ఎల్లమ్మను పూజిస్తారు. ఎల్లమ్మపై పాడుకునే పాట -

"శివుని చిన్నబిడ్డవమ్మా ఎల్లమ్మా - నీవు
శివనెల్ల మాతవమ్మా ఎల్లమ్మా
పుట్టలో పుట్టినావు ఎల్లమ్మా - నీవు
పుడమిపై బిడ్డవమ్మా ఎల్లమ్మా
నాగవన్నె చీరలమ్మా ఎల్లమ్మా - నీకు
నెమలికండ్ల రవికెలమ్మా ఎల్లమ్మా
పదుముగవ్వాలు తల్లీ ఎల్లమ్మా - నీకు
వెనుక నీకు దరిసెనమ్మా ఎల్లమ్మా
గవ్వలంది కంకణమ్ము ఎల్లమ్మా — నీకు
గంటలా రథమమ్మా ఎల్లమ్మా
నాగుబాముల బట్టినావూ ఎల్లమ్మా - నీవు
నడికట్టు వేసినావు ఎల్లమ్మా
జెర్రిపోతుల బట్టినావూ ఎల్లమ్మా - నీవు
జడకొప్పులు వేసినావు ఎల్లమ్మా"31

ఈ పాటను బట్టి ఎల్లమ్మ పుట్టలో పుట్టి పుడమిలోకి వచ్చిందట. ఆమెకు నాగవన్నెల చీరలు, నెమలికండ్ల రవికలట. ఆమె నడుము చుట్టూ గవ్వలట. ఆవిడకు గంటల రథమట, చేతుల్లో నాగుబాముని పట్టుకొని ఉంటుందట. జెర్రిపోతుల ధరించి, జడకొప్పుకు వాటిని చుట్టుకుందట. తెలంగాణా ప్రాంతంలో పాములను ఎల్లమ్మగా కొలుస్తారు.

ఎల్లమ్మను పూజించితే గొడ్రాండ్రకు సంతానమిస్తుందట. గ్రామాన్ని సుభిక్షంగా చేస్తుందట. ఆమెకు జంతుబలులు కూడా యిస్తారు. కొన్ని గ్రామాలలో ఎల్లమ్మ పూనకం వస్తుంది. ఆ సమయంలో బవనీలు పంబజ వాయిసూ—

"ఆడిరావె పాడిరావె ఎల్లమ్మా

నువ్వు ఆనందాలు పాడు తల్లి ఎల్లమ్మ" — అని కోడిస్తారు. ఎల్లమ్మ నమ్మిన వారందరిని కాపాడుతుందనే నమ్మకం జానపదులకున్నది.

కన్నడదేశంలోకూడా జానపదులు ఎల్లమ్మ, కాళవ్వ, సోరవ్వ, సత్యవ్వ, సెట్టవ్వ, జక్కవ్వ, దురగవ్వ, కరియవ్వ మొదలైన గ్రామదేవతలను కొలుస్తారు. ఎల్లమ్మపై కన్నడంలో కూడా పాటలున్నాయి. కన్నడీకులు - "ఎల్లమ్మ కాయీ ఎల్లమ్మా" అంటూ ఎల్లమ్మను స్తుతిస్తారు.

బెల్గాంజిల్లా సవదత్తిలో వెలసిన ఎల్లమ్మకు ప్రతియేటా జాతర చేస్తారు. లక్షలాదిగా జనం వస్తారట. ఇక్కడ దేవతకు 'ఏళుకొళ్ళద ఎల్లమ్మ' (ఏడు లోయల ఎల్లమ్మ) అని పేరు.

ఎల్లమ్మ జాతర సమయంలో —

"ఏళుకొళ్ళదల్లిరువ ఎల్లమ్మన
జాత్రెయమాడవ బా
సత్యుళ్ళ సత్యవ్న పాదవ
పూజెయ మాడుట బా

ఉధో ఉదో ఉధో ఎన్నుతహాడను హాడవబా''[33] అన స్తుతిస్తారు. ఈ పాటలో ఆడవాళ్ళు అలంకరించుకొని ఎల్లమ్మ గుడికి రావడం వర్ణింపబడింది. వేపమండలు మొదలైనవి పట్టుకొని రావడంకూడా చెప్పబడింది. ఇటువంటి పాటలవల్ల ఆచార వ్యవహారాలు కూడా తెలుస్తాయి. ఎల్లమ్మవలెనే కెంపమ్మ మొ॥ గ్రామదేవతలకు జాతరలు చేస్తారు. పాటలు పాడుకుంటారు.

## 10. ఆధ్యాత్మిక తత్త్వాలు

ఆత్మజ్ఞానానికి సంబంధించినవి ఆధ్యాత్మిక తత్త్వాలు. తత్త్వజ్ఞానం తెలిసినవారు పరమాత్మతో సమానులు. "తత్త్వమే దెలిసితె తానె పో బ్రహ్మంబు". జీవాత్మయే పరమాత్మ అనే యథార్థ జ్ఞానం - తెలుసుకోవాలని వేదాంతులు చెపుతారు...."జ్ఞానమొక్కటి చాలు ముక్తికి మానవులకెల్లను'' అని వేదాంతుల భావన. జానపదులు తంబురా మీటుతూ పాడుకునే ఆధ్యాత్మిక తత్త్వాలు అనేకం ఉన్నాయి. ఆత్మ తత్త్వం తెలుసుకోడానికి గురువు అవసరం. ఆధ్యాత్మిక మార్గంలో గురువు ఆవశ్యకత ఎంతో ఉంది. దేవునకు

జీవునకు అను సంధాన కర్త గురువు. సాధకులకు గురూపదేశం అవసరమని తెల్పే తత్త్వకీర్తన చూడండి —

"దేవుడు తనలో దండిగనుండగ
తెలియదు మానవ పశువులకు
సంశయముడుగక సద్గతి మేరకు
సర్వము తానని తెలియవలెన్
సర్వము తానని తెలిపేటందుకు
గురూపదేశం కలుగవలెన్
గురూపదేశం కలిగేటందుకు
నిలకడగా మది నిలువవలెన్"[33]

తన్ను తాను తెలుసుకోడానికి గురువు అవసరం అటువంటిది.

కన్నడ జానపదులు కూడా అనేక తత్త్వ కీర్తనలు ఆలాపిస్తారు. గురు మహిమ, గురుభక్తులకెగాని తెలియదని, మూఢనరులు అంతరంగిక జ్యోతిని కనుగొనలేరని తెల్పే కన్నడ తత్త్వ కీర్తన —

"గురువిన మహిమెయ గురుభక్తరె బల్లరు చందమామా!
మూఢనరరేను బల్లరు నడురంగ జోతియ చందమామా!
కదరుగా తరమరకుదురె గాతరహావ్వ చందమామా!
ఒంటెగాతరకాయి ఆనెగాతరహావ్వ చందమామా!
కణ్ణిల్లదాతను కండను అమర చందమామా!
కైయిల్ల దాతను కొయ్దను ఆహణ్ణు చందమామా!"[34]

ఇటువంటి చందమామ తత్త్వాలు తెలుగులో కూడా ఉన్నాయి. కన్ను లేని వాడు చెట్టును చూడడం, నాలుకలేనివాడు రుచి చూడడం ఇత్యాది విషయాలు తెలుగు తత్త్వాలలో కూడా చూడవచ్చు.

తెలుగులో రూపకాల నాశ్రయించి వేదాంతాన్ని చెప్పడం కనిపిస్తుంది. ఈ క్రింది వేదాంతకీర్తన చూడండి.

"పత్తివిడువా వస్తారేమమ్మా పూదోటలోకి
పత్తివిడువా వస్తారేమమ్మా!

పత్తివిడువా వస్తే మీరు భక్తి బాటా దెలుసుకోని
ముక్తిగల్గా చేసి పత్తిమూలమెంగి విడిచేకొరకూ ॥పత్తి॥
భూమిలేని చేనుదున్ని యేమిలేని పైరుపెట్టి
యేకముగా మనముబట్టి పాకముగా విడిచేకొరకూ ॥పత్తి॥
.... ... .... .... ...
మానసమానే సద్దిగట్టి మాయదుత్తా చేతబట్టి
కల్లాలాడే చేనిపత్తి కొల్లలుగా విడిచే కొరకు ॥పత్తి॥
సత్యమానే వడిగట్టి నిత్యామానె మునముబట్టి
... .... .... .... ....
అసత్యమానే చెనిపత్తి బాలుబాలు దప్పకుండా ॥పత్తి॥"35

పై తాత్త్విక గేయంలో రూపకాల నాశ్రయించిన వేదాంతం, మార్మికత కనిపిస్తుంది. అసత్యమనే చేను దేహానికి ప్రతీక. పత్తిని జీవునిగాను, పత్తి విడుచుట అనగా జీవునకు ముక్తి కలిగించుటగా చెప్పకోవచ్చు. జీవాత్మ, పరమాత్మను ఐక్యంచెందే మార్గం పత్తి విడుపు మిషతో చెప్పబడింది.

కన్నడంలోనూ ఇలాంటి వేదాంత గీతాలున్నాయి. చీకటి వంటి మనసు అనే పొట్టును తీసి పారెయ్యాలి. పిమ్మట జ్ఞానమనే వంట చెయ్యాలని అర్థమిచ్చే తాత్త్విక గేయం చూడండి —

"అడిగెయను మాడబేకణ్ణా
నాపీగజ్ఞానద అడిగెయను మాడబేకణ్ణా ॥ప॥
అడిగెయను మాడబేకు మదినబేకు మదగళన్ను
ఒడియె నాడ్జైయింది ఒళ్ళేనద గరదముక్తి అదకె॥
మనెయ నారని మడగ బేకణ్ణా
ఆబళిక తన్నాఘనది, గురువన్ను, నెనెయు బేకణ్ణా
కనసుయెంబవ కాల్మషం గః వనికె యిందకుట్టేకేరి
తనగె తానె అదకర్చను
అచ్చి అడిగెయను మాడ బేకణ్ణా
తత్వభాండవ తొళియ బేకణ్ణా
సత్యాత్మనగ్ ఒ సి అ సి అక్కియ మధిస బేకణ్ణా ।"36

ఇలాటి ఆధ్యాత్మిక తత్త్వాలెన్నో కన్నడదేశంలో ప్రచారమందున్నాయి. ఇవి జానపదుల మనస్తత్త్వాన్ని, ఆధ్యాత్మిక జీవన విధానాన్ని కూడా వెల్లడిస్తాయి.

11. యోగతత్త్వాలు

జీవాత్మను పరమాత్మతో అనుసంధించే సాధనం యోగం. చిత్తవృత్తుల నిరోధించడం యోగానికి అవసరం యోగప్రక్రియల్లో విధానాన్ని బట్టి నాలుగు భేదాలున్నాయి. 1. యమనియమాది అష్టాంగాలతో కూడిన రాజయోగం. 2. శ్వాసక్రియకు, ఆసనాలకు సంబంధించిన హఠయోగం. 3. దేహంలోని పంచవింశతి తత్త్వాలను తెలిపే సాంఖ్యయోగం. 4. పరాశక్తిరూపిణియైన కుండలినీ శక్తిని మేల్కొలిపే కుండలినీయోగం. వీటన్నింటికి తెలుగులో గేయాలున్నాయి. మచ్చునకు రాజయోగాన్ని గురించి తెల్పే యోగతత్త్వ కీర్తన చూడండి —

> "ఇదియె రాజయోగంబు వివరింతు సుతులార
> విదితముగ సుజ్ఞాన వీధి నిలిచిననూ ॥ఇదియె॥
> సంసారమున నుండి ఆత్మకనుగొన రాజయోగమనుచు పలికెద రిలలో
> హంస ఆటలుకట్టి ఆలనిర్వికారమున ఆనందమయుడై
> నిండి వెలిగిననూ ॥ఇదియె॥
>
> ఇంద్రియంబులన్ని మనసుతో బంధించి
> మనసు మారుతమునందు నా గూర్చి
> మారుతము ఆత్మలో నిమిడించి
> విరక్తుడై సకలచరాచరములం చూడగల్గిననూ."37 ॥ఇదియె॥

సంసారంలో ఉంటూ ఆత్మను కనుగొనేది రాజయోగం. ఆరాజయోగ విధానం విశిష్టతపై యోగకీర్తనలో వివరింపబడింది.

కన్నడంలో కూడా రాజయోగ సంబంధ కీర్తనలున్నాయి. రాజయోగానికి అర్థం తెలుసుకోవాలని, నరజన్మయెత్తిన తర్వాత సన్మార్గవర్తనుడై, రాజయోగంద్వారా ముక్తి పొందాలని తెలిపే వేదాంతతత్త్వం —

"రాజయోగద మాతిన అర్థతిళియ బేకు
నరజన్మ దల్లి హుట్టిదమేలె
మోక్షమార్గ దల్లిర బేకు
తాయితందె హొట్టెయల్లి హుట్టి అవర
పాదపూజె మాడలె బేకు
గురు హిరియరన్న కండరె
భక్తిమార్గ దొళిర బేకు."[38] — అని కీర్తిస్తారు.

జలమునందు ఉప్పును కలిపిన నీటిసామ్యాన్ని పొందినట్లు, జీవాత్మ పరమాత్మ సామ్యాన్ని పొందుటే సర్వయోగముల ప్రయోజనం.

## 12. కాలజ్ఞానతత్త్వాలు

కాలజ్ఞానమంటే భవిష్యత్ జ్ఞానం. యోగవిద్య ద్వారా యోగులు భూత భవిష్యత్తులు తెలుసుకునే వారు. జానపదుల దృష్టిలో కాలజ్ఞానమనగా జరగ పోయే ఉత్పాదాలు, ప్రకృతి వైపరీత్యాలు, వింతలు, సాంఘిక మార్పులు ఇత్యాదులు మాత్రమే. తెలుగులో శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మంగారి కాలజ్ఞానతత్త్వాలకు బహుళ ప్రచారం ఉంది.

"హరిగోవింద గోవింద
హరి భజగోవింద గోవింద
హరిశివగోవింద, హరిజయ గోవింద'' — పల్లవిలో సాగే పాటలు పెక్కులున్నాయి. జరగబోయే వైపరీత్యాలను వివరించేగేయం

''ఆకులేని తీగ లోకమంతా ప్రాకి
ఆకటి చావులు చచ్చేరుమా
అన్నిదేశాలలో అంతర్యుద్ధముల్
అధికమై అల్లాడి పోతారు బ్రహ్మ ॥హరిగోవింద
తాడిపత్రిలోనా మేక మానవుడౌను
చిత్రమరణములెన్నో వచ్చేనిమా

చింతలలో జనులెల్ల చిట్లి చిట్లి
శిథిలమై పోతారు బ్రహ్మ ॥హరిగోవింద॥
పందికడుపున యేన్గు పదిలముగ
పుట్టి వచ్చేనుమా ! పగటి
చుక్కలు చూచి భయముతో
చిట్లి చిట్లి ప్రజలు కూలేరు బ్రహ్మ ॥హరిగోవింద॥
శ్రీశైల తిరుపతి పుణ్యక్షేత్రాలయందు
నీతినప్పి దోచుతుంటారయా
ఆలుమగలు తగవులధికమై భువిలోన
అంతమొందే కాలమొస్తుంది బ్రహ్మ'' ॥హరిగోవింద॥[39]

ఇలాటి వైపరీత్యాలు ఎన్నో జరుగుతాయని కాలజ్ఞాన తత్త్వాలు చెపుతాయి. జానపదులు వీరబ్రహ్మం చెప్పినట్లు పాడుకొనే గేయాలు కూడా ఉన్నాయి.

కాలజ్ఞానతత్త్వాలు కన్నడంలో కూడా అసంఖ్యాకంగా ఉన్నాయి. రుద్రముని, నీలమ్మ మొదలైనవారి తత్త్వాలు బహుళ ప్రచారమందున్నవి. రుద్రముని చెప్పిన కాలజ్ఞానం —

"ముందిన సూచనె చెన్నాగి హేళు వెకేళి రణ్ణా
భూమి మేలణ వృక్షగళెల్లవు మురిదావునోడి రణ్ణా
సీమెగళెల్లవు హాళాగి హోదవు కేళి రణ్ణా
లోకక్కె మీరిద చోరరు బరుతారెకేళి రణ్ణా
మారాట నడియాదు హోరాట వాదీదు నోడి రణ్ణా''[40]

భూమిపై వృక్షాలు నరుకబడి, సీమలన్నీ పాడవుతాయని, మితిమీరి చోరులు కనిపిస్తారని, వ్యాపారంబదులు పోరాటం జరుగుతుందని, ఏనుగు కడుపున సింహం పుట్టుతుందని, మనిషికడుపున పాముపుట్టుతుందని, ఏడు సంవత్సరాలకే యువతిగర్భం ధరిస్తుందని, బ్రాహ్మణులు భ్రష్టులు కాగలరని, కన్నడంవారు తెలుగు కాలజ్ఞాన రచనలలో చెప్పినట్లే చెప్పినారు.

ఈవిధంగా తెలుగు, కన్నడ పారమార్థిక గేయాలు చాలవరకు సారూప్యత కలిగి యున్నాయి. భాషలు వేరైనా జానపదుల పారమార్థిక భావ మొక్కటేనని తెలుగు కన్నడ తులనాత్మక పరిశీలన వలన తేలింది.

## అధస్సూచికలు

1. చూడుడు : - నా 'జానపద పారమార్థిక గేయసాహిత్యం' (1986)
2. పండితారాధ్య చరిత్రము, పర్వత ప్రకరణం, పుట. 518.
3. డా. ఆర్వీయస్ సుందరం, తెలుగు - కన్నడజానపద గేయాలు ప్రవేశిక, పుట. 1
4 నేదునూరి గంగాధరం, మిన్నేరు, పుట 145.

5&6 తెలుగు కన్నడ జానపద గేయాలు, పుట. 55. & పుట 54.

7. నేదునూరి గంగాధరం, మిన్నేరు, పుట. 219.
8. తెలుగు కన్నడ జానపద గేయాలు పుట. 56.
9. పాడినవారు, చిన్నస్వామి (32) ఎట్టేరి గ్రామం చిత్తూరు జిల్లా.
10. కరీంఖాన్. జానపద గీతెగళు పుట. 1.
11. నేదునూరి గంగాధరం, వివిధ మంగళ హారతులు పుట. 1
12. తెలుగు కన్నడ జానపద గేయాలు పుట. 98

13&14 డా. ఇ. బాలకృష్ణారెడ్డి, జానపద పారమార్థిక గేయ సాహిత్యం పుటలు. 68, 70.

15. డి. 2573, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రాచ్యపరిశోధన సంస్థ వేదాంత కీర్తనలు.
16. బి. ఎస్. గద్దగి మఠ, కన్నడ జానపద గీతెగళు పుట. 8

17&18 తెలుగు కన్నడ జానపద గేయాలు పుట. 95

19. శ్రీ భగవన్నామ సంకీర్తనలు పుట. 25

20. తెలుగు - కన్నడ జానపదగేయాలు పుట. 97
21. శ్రీ పాండురంగ బృందావన భజన కీర్తనలు పుట. 44
22. తెలుగు కన్నడ జానపద గేయాలు పుట. 97
23. డి. 2590 గేయములు, శ్రీ వేం. వి. ప్రాచ్య పరిశోధన తిరుపతి
24. తెలుగు కన్నడ జానపద గేయాలు పుటలు 59, 60
25&26. నేదునూరి గంగాధరం, మిన్నేరు, పుట 220, 230
27&28. తెలుగు - కన్నడ జానపదగేయాలు పుట. 100, 101
29 జానపద పారమార్థిక గేయ సాహిత్యం, పుట. 57
30. — పైదే — పుట 99
31. రఘుమారెడ్డి, ఎర్దెండ. పల్లె పదాలలో ప్రజాజీవనము పుట. 352
32. ఎం. కృష్ణమూర్తి, ఏలుకోళ్ళద ఎల్లమ్మ పుట 67
33. కాలజ్ఞాన తత్త్వములు పుట. 35
34 తెలుగు కన్నడ జానపద గేయాలు పుట. .04
35. పూదోట లింగమూర్తి తత్త్వము. పుటలు 121, 122
36. బళ్ళారి తత్వగళు పుట - 15
37. పూదోట లింగమూర్తి వచనములు. పుటలు 29, 30
38. బళ్ళారి తత్వగళు పుట 9.
39. జానపద పారమార్థిక గేయ సాహిత్యం పుట 330
40. జానపద సం. పుట 54 (కర్నాటక జానపద పరిషత్తు)